**కొత్త** హార్లిక్స్ బిస్కెట్స్.

# కొంతమంది మంచి రుచి నిపుణులు యిలా అంటున్నారు...













కొత్త

## హార్లిక్స్ బిస్కెట్స్

ఇప్పుడు

రుచికరమైనవి, పాలతో నిండినవి, మరియు సంపూర్ణమైన హార్లిక్స్ మంచితనం.

HTA 5456 TEL


Try-Me
Try-Me
CARAMILK
CARAMILK
COFFY BITE
Parry's
Fun & Games

ప్రపంచంలో పెద్ద సముద్రం ఏది?

......................................

సూయజ్ కెనాల్ ఏ రెండు సముద్రాలని కలుపుతోంది?

......................................

ప్ర: ఏ భారతీయ నదికి ట్సంగ్పో అనే టిబెట్ దేశపు పేరు వుంది?

జ: ......................................

ప్ర: అర్జెంటీనాని ఏ సముద్రం చుట్టి వుంది?

జ: ......................................

ప్ర: దక్షిణ అమెరికాలో పొడవైన నది ఏది?

జ: ......................................

ప్ర: ఇవి ఏ దేశానికి చెందుతాయో చెప్పండి?

జ: బైకాల్ సరస్సు ......................................
నాసర్ సరస్సు ......................................
వాన్ సరస్సు ......................................
విన్నిపెగ్ సరస్సు ......................................

పేరు ......................................

......................................

చిరునామా ......................................

......................................

......................................

పిన్‌కోడ్ ......................................

పుట్టిన తేది ...................... వయసు ......................

చేపలతో వినోదం

ఈ క్రింది చిత్రాన్ని జాగ్రత్తగా చూసి అందులో ఎన్ని చేపలు వున్నాయో లెక్కపెట్టండి.



మార్చి నెల కింగ్ క్విజ్ విజేతలను కలుసుకోండి

1వ బహుమతి: కంచన్ సర్కార్, న్యూఢిల్లీ

2వ బహుమతి: 1 చారులతా సూర్యనారాయణ్, మద్రాసు
2 కె. అరవింద్, బెంగళూరు

3వ బహుమతి: 1 పి.సి. ప్రవీణ్, ఉజ్జైన్
2 నితిన్, మద్రాసు
3 యం. కేదార్, సికింద్రాబాద్

కన్సొలేషన్ బహుమతులు నెగ్గినవారికి పోస్ట్‌ద్వారా తెలియజేయబడింది.

ఇవిగో సరియైన జవాబులు

భారత జాతీయ విహంగం: నెమలి

సుందరవనాలు ఎందుకు ప్రఖ్యాతి చెందాయి: రాయల్ బెంగాల్ టైగర్

సాధారణ లంగూర్‌కి ఎవరి పేరుకూడా వుంది: హనుమాన్ దండిపూర్ పులుల సంరక్షణ కేంద్రం వున్న ప్రాంతం: కర్ణాటక

రాన్ ఆఫ్ కచ్ ఎందుకు ప్రఖ్యాతి చెందింది: అడవి గాడిద ఈ సంరక్షణ కేంద్రాలు ఏ మృగాలకి చెందినవి నాగార్జున సాగర్—పులి. కజిరంగా—ఖడ్గమృగం. గిర్-సింహం. భరత్‌పూర్—పక్షులు

గమనిక మిఠాయిల మహారాజు మీ గురించి తెలుసుకోవాలనుకుంటున్నాడు. అందుచేత అతనికి ఒక ఉత్తరం ఈ క్రింది చిరునామాకి రాస్తారుగదూ!

HTA-7155

## Boost is the secret of my energy!

"పదిహేను, యిరవై ఓవర్లు బౌల్ వేయడం లేదా మంచి షాట్స్ కొడుతు బ్యాట్ చేస్తు యిన్నింగ్స్ ఆడటం, మా జట్టు వ్యూహాన్ని నిర్ణయించుకుంటు రోజంతా ఆట మైదానంలో నిలబడే ఉండటం. నాకు నా క్రికెట్ ఆట అలాగ ఉండటమే యిష్టం.

దీనికి శారీరకంగా మంచి దారుఢ్యంగా ఉండాలి. ఎంతో శక్తి కూడా అవసరం, అందుకే నేను బూస్ట్ త్రాగుతాను - ప్రతి రోజు కూడా."



కపిల్ బూస్ట్ త్రాగుతారు, ఎందుచేతనంటే అది ఆయనకు కావలసిన శక్తి యిస్తుంది. అదే ఆయనకి యిష్టమైన రుచి కూడా. బూస్ట్‌లో మీగడ పాలు, ఆరోగ్యాన్నిచ్చే మాల్ట్ ల మంచి తనం, కోకో సమ్మిళితమై ఉంటాయి.

కపిల్‌ని అడగండి. అదే ఆయన విజయ రహస్యం.




# బూస్ట్ రుచితో నిండిన శక్తి

HTA 5461 TEL




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["చిత్రమైన నిర్ణయం"]కు ఆధారం, మల్లవరపు మనోహరరెడ్డి రచన. వివేకవంతుడైన వ్యక్తి, ఆత్మస్తుతి చేసుకోడు. ఎందుకంటే, ఆత్మస్తుతిలో పరనిందపాలు, వుండితీరుతుంది. ఇందుకు భిన్నమైనది తెలివిగల వాళ్ళమనుకునే వాళ్ళ ధోరణి. ఎదుటివాళ్ళు అన్నిటా అప్రయోజకులన్న అహంకారంతో వాళ్ళు మాట్లాడుతుంటారు. ఇందుకు ఉదాహరణ "నారాయణమాట" అన్నకథ.

## అమరవాణి

యత్ తదగ్రే విషమివ, పరిణామే మృతోపమమ్,
తత్ సుఖం సాత్వికం, ప్రోక్తమాత్మబుద్ధి ప్రసాదజమ్.

[మొదట విషంలాగా భయంకరంగా ఉన్నప్పటికి—నిర్మలమైన సాత్విక జీవితం ప్రసాదించే సుఖం, క్రమేణా అమృతంతో సమానమైన ఆనందం కలిగిస్తుంది.]

సంపుటి 82 మే '88 సంచిక 5

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00

CHITRA

# చందమామ కబుర్లు



## ఏడేళ్ళ విజ్ఞానవేత్త!

కొత్తగా కనుగొనబడిన పరిశోధనలమధ్య అమెరికాలో యేటా పోటీ జరుగుతుంది. ఇటీవల జరిగిన పోటీలో—టెక్సాస్ స్కూల్లో చదువుకుంటూన్న ఏడేళ్ళ భారతీయ విద్యార్థి సచిన్ వకీల్‌కు ప్రథమ బహుమతి లభించింది. శీతాకాలంలో భూమి మీదికి సూర్యకిరణాలు ప్రతిఫలింపజేసి, వేడి పుట్టించే విధంగా—అద్దం అమర్చిన ఒక పెద్ద శాటలైట్‌కు సచిన్ రూపకల్పన చేశాడు! ఇది విద్యుత్తును కూడా ఉత్పత్తి చేయగలదట!

## విచిత్ర సమావేశాలు!

స్విట్జర్లాండ్‌లోని శావాగ్నిన్‌లో విచిత్రమైన సమావేశాలు జరిగాయి. ఒకే కాన్పులో పుట్టి ముగ్గురూ ఒకే పోలికతో ఉండేవాళ్ళ ద్వితీయ అంతర్జాతీయ సమావేశమూ; నలుగురూ ఒక విధంగా ఉండేవాళ్ళ ప్రథమ సమావేశమూ జరిగాయి. ముగ్గురు ఒకే పోలికగా ఉన్న 43 జట్లమందీ; నలుగురు ఒకే పోలికలో ఉండే వాళ్ళు ఐదు జట్లూ; ఐదుగురు ఒకే పోలికలో ఉన్న ఒక జట్టూ ఈ సమావేశంలో పాల్గొని తమ సాధకబాధకాలు చర్చించారు.





## కొత్త జంతువు

ఈ జంతువు భూమి మీద కొత్తకాదు. కాని, దానిని మనిషి చూడడం ఇదే కొత్త. పెద్ద పెద్ద కళ్ళతో, ఒళ్ళంతా రోమాలతో 80 సెం.మీ. పొడవూ, 1.2 కి.గ్రా. బరువూ కలిగి రాత్రులలో ఎక్కువగా సంచరించే ఈ జంతువుకు గోల్డన్ బాంబూ లెమూర్ అని పేరు పెట్టారు. మడగాస్కర్ ప్రాంతంలో కనుగొనబడిన ఈ జంతువు కాళ్ళు చేతులు మనిషి కాళ్ళు చేతుల్లాగా మెత్తగా ఉంటాయి.

## సముద్రగర్భంలో గృహం!

వర్జిన్ ఐలండ్స్ సమీపంలో సముద్రం లోపలి భూమి మీద మూడు గదుల ఇల్లు నిర్మాణం జరిగింది. ఇక్కడి నుంచి సముద్రాంతర్గత పరిశోధనలు జరపాలని విజ్ఞాన వేత్తలు నిర్ణయించారు!



# అసలూ-వడ్డీ

శ్రీరంగపురం గ్రామంలో, లక్ష్మయ్య అనే ఒక దుకాణదారు వుండేవాడు. ఆ గ్రామంలో మిగతా దుకాణాలలోకన్న, అయన దుకాణంలోనే ఎక్కువ వ్యాపారం సాగుతూండేది. ఆ కారణంగా, లక్ష్మయ్య గ్రామంలోని కొద్దిమంది ధనవంతుల్లో ఒకడుగా చలామణి అవుతుండేవాడు. అయితే, యితర ధనవంతుల్లాగా, అయన ఏ పరిస్థితుల్లోనూ ఎవరికీ డబ్బు వడ్డీకి యిస్తూండేవాడు కాదు. ఇది చాలామందికి ఆశ్చర్యం కలిగిస్తూండేది. అతడు ప్రతి నెలా, తనకు వచ్చిన లాభంలో చాలా మొత్తం తీసి, ఒక పెట్టెలో జాగ్రత్తగా దాస్తూండేవాడు.

లక్ష్మయ్య యింటి పొరుగున, ఒక వడ్డీ వ్యాపారి వుండేవాడు. అయనకు లక్ష్మయ్య ప్రవర్తన ఎంతో వింతగా కనబడేది. ఒకనాడు, ఆయన వుండబట్టలేక, లక్ష్మయ్యతో, "చూడు, లక్ష్మయ్యా! నువ్వు వ్యాపారంలో బాగా గడిస్తున్న సంగతి, అందరెరిగిందే. దాన్ని వూరికే పెట్టెల్లో దాయడంవల్ల లాభమేమిటి? నా మాట విని, దాన్ని నాలాగే వడ్డీకి తిప్పు. అందువల్ల, నీ అసలుకు అసలూ వుంటుంది, అదనంగా వడ్డీ కూడా వస్తుంది. ఇప్పుడు నువ్వు చేస్తున్న పనివల్ల, అసలుమాత్రమే వుంటుంది. అనవసరంగా వడ్డీ డబ్బు పోగొట్టుకుంటున్నావు," అన్నాడు.

అంతా విని లక్ష్మయ్య గుంభనగా నవ్వుతూ, "నువ్వనుకున్నంత తెలివిహీనుణ్ణి కాదులే. ఆ దాచే డబ్బులో, అసలుతోపాటు దానికయ్యే వడ్డీ కూడా లెక్కకట్టి వేస్తున్నాను," అన్నాడు.

—సి. ఎస్. ఎ. షరీఫ్





# నారాయణమాట

నారాయణకు డబ్బు లేకపోయినా గర్వమెక్కువని ఊళ్ళో అందరూ చెప్పుకునేవారు. వాడెప్పుడూ ఎవర్నీ దేనికీ దేహీ అని యాచించలేదు. పదిమందికీ సాయపడడమే తప్ప, ఎవర్నీ సాయమడిగేవాడు కాదు. పౌరుషం గల మనిషని అందరూ వాడి గురించి అనుకునేవారు.

అలాంటి నారాయణ ఒక రోజున, ఊళ్ళో రచ్చబండ దగ్గిర కబుర్లు చెబుతున్న వీరభద్రాన్ని పలకరించి, ''బాబూ, తమరివల్ల నాకో సాయం కావాలి,'' అన్నాడు.

ఆ సమయంలో వీరభద్రం తనచుట్టూ చేరినవారికి, తన గురించి గొప్పలు చెబుతున్నాడు. ఆయన బాగా కలిగినవాడు కావడంవల్లా, ఆయనతో చాలా అవసరాలుండడంవల్లా, అంతా నోరెత్తకుండా ఆయన చెప్పేది వింటున్నారు. ఆ స్థితిలో, నారాయణ తనను పలకరించి సాయమడిగేసరికి వీరభద్రం చెప్పలేనంతగా పొంగిపోయాడు.

''ఏం కావాలో అడుగు. నా చేతనైంది చేస్తాను,'' అన్నాడు వీరభద్రం, నారాయణ వంక ఆప్యాయంగా చూస్తూ.

''నా కూతురు పెళ్ళికి మున్నూరు వరహాలు అప్పు కావాలండి,'' అని నారాయణ యింకా ఏదో చెప్పబోతూండగా, వీరభద్రం చిరునవ్వునవ్వి, ''దానిదేముందీ, అలాగే తీసుకో! నీలాంటివాడడిగితే నేను కాదంటానా?'' అన్నాడు.

''మీ డబ్బు యివ్వద్దు, బాబూ! సెట్టి దగ్గిర తీసుకుంటాను. తమబోటివారు హామీ వుంటే తప్ప, సెట్టి నాకు అప్పివ్వనన్నాడు,'' అన్నాడు నారాయణ.

"మున్నూరువరహాలకుహామీ కావాలా? ఆ డబ్బు కోసం సెట్టిదాకా ఎందుకు?

"వసుంధర"

నేనే యిస్తానులే!" అన్నాడు వీరభద్రం అభిమానంగా.

"వద్దు, బాబూ! తమరు వడ్డీ తీసుకోరు. వడ్డీ లేకుండా అప్పు తీసుకుంటే, నాకు తృప్తిగా వుండదు," అన్నాడు నారాయణ.

వీరభద్రం, నారాయణకు వడ్డీలేకుండా తనే అప్పిస్తానని బలవంతం చేశాడు. నారాయణ అందుకు ఒప్పుకోక, "తమకు హామీ వుండడం యిష్టం లేకపోతే వేరే పెద్దమనిషినిచూసుకుంటాను," అనేశాడు.

ఆ జవాబుకు వీరభద్రం తడబడి, "నీకెవరూ హామీకి దొరకరు. ఎవర్నీ అడక్కుండానే ముందుగా నా దగ్గర కొచ్చావా?" అని అడిగాడు.

"దేవుడిపై ఆన. ముందుగా తమ దగ్గరకే వచ్చాను," అన్నాడు నారాయణ వినయంగా.

వీరభద్రం తృప్తిగా తలాడించి, "నారాయణా! నువ్వెప్పుడూ ఎవర్నీదేనికీ సాయమడగని పౌరుషం గల మనిషివని, ఊరంతా నీ గురించి చెప్పుకుంటారు. అలాంటివాడివి సాయం అవసరం అయేసరికి, ముందుగా నా దగ్గిరికే వచ్చావు. ఈ ఊళ్ళో యింతమంది వుండగా, నువ్వు నా దగ్గిరికే రావడంలో ఏదో విశేషం వుండాలి. అదేమిటో చెప్పరా! అంతా వింటాను," అన్నాడు.

వీరభద్రం అలా అనడానికి కారణం వున్నది. సాధారణంగా నారాయణ ఎవరినీ



పొగడడు. ఇప్పుడు వాడికి డబ్బవసరం వున్నది కాబట్టి, తనను తప్పక పొగుడుతాడు. ఆ పొగడ్తలు నలుగురూ వినాలని, ఆయన కోరిక.

ఇంత చిన్న విషయానికి వీరభద్రం, పెద్ద హడావిడి చేయడం నారాయణకు వినుగు కలిగించింది. అయినా వాడు బయటపడకుండా, "ఆ సంగతి ముందుగా చెప్పకూడదండి. నా కార్యం జయప్రదంగా ముగిశాక, తమకు చెబుతాను,'' అన్నాడు.

''ఎప్పుడు చెప్పినా సరే, అందరిమధ్యా చెప్పాలి!'' అన్నాడు వీరభద్రం షరతు పెడుతున్నట్టు.

ఇందుకు నారాయణ సరేనన్నాడు. వీరభద్రం అప్పటికప్పుడు సెట్టికి కబురు పెట్టి రప్పించి, ''నారాయణకు మున్నూరు వరహాలు అప్పివ్వు. నేను హామీ వుంటాను,'' అని చెప్పాడు.

సెట్టి అంగీకారంగా తలూపాడు. ఆ తర్వాత నారాయణ కూతురు పెళ్ళి జయప్రదంగా జరిగిపోయింది. అది జరిగి వారం రోజులు తిరక్కుండానే, నారాయణ సెట్టి దగ్గిర తీసుకున్న అప్పు కూడా వడ్డీతో సహా తీర్చేసి, ఆ విషయం చెప్పడానికి వీరభద్రం దగ్గిరకు వెళ్ళాడు. ఆ సమయానికి వీరభద్రం రచ్చబండ దగ్గిర, ఎప్పటిలాగే గొప్పలు చెబుతున్నాడు.

ఆయన, నారాయణ చెప్పింది విని ఆశ్చర్యంగా, ''ఇంత తొందరగా బాకీ ఎలా తీర్చేశావురా?'' అని అడిగాడు.





దానికి నారాయణ, "అయ్యా, నా కూతురు పెళ్ళికోసం డబ్బు కూడబెడు తున్నాను. దాన్ని ఒక పెద్ద మనిషి దగ్గిర దాచుకున్నాను. ఆయన దాన్ని తన అవసరానికి వాడుకుని, ఆ విషయం యింకెవరికీ చెప్పొద్దని వేడుకున్నాడు. అందువల్లనేనాకు అప్పుకావలసివచ్చింది. ఇప్పుడా పెద్దమనిషి, నా డబ్బు నాకు యిచ్చేశాడు. నేనేమో బాకీ తీర్చేశాను," అని జవాబిచ్చాడు.

"పేదవాడి డబ్బును వాడుకున్న, ఆ పెద్దమనిషి ఎవడ్రా?" అన్నాడు వీరభద్రం.

రచ్చబండ మీద చేరిన వాళ్ళందరూ పెద్దగా నవ్వారు.

"నేనాయనకు మాట యిచ్చాను. ఆయన పేరు చెప్పను," అన్నాడు నారాయణ.

వీరభద్రం చిన్నగా నవ్వి, "నిజమేలే— నువ్వు అన్నమాట మీద నిలబడే మనిషివే! కాని, హామీ కోసం నా దగ్గిరకే ఎందు కొచ్చావో చెబుతానని, మాట యిచ్చావు. అవునా? ఆ మాట మీద కూడా నిలబడు," అన్నాడు.

"ఎందుకు నిలబడను, బాబూ! నే చెప్పే మాటలు, మీకొక్కరికే చెప్పనా లేక నలుగురూ వినాలా?" అని అడిగాడు నారాయణ.

"చెప్పేదేదో నలుగురూ వినేలాగే చెప్పు," అన్నాడు వీరభద్రం.

"అయితే వినండి, బాబూ! నేను పౌరుషం గల మనిషిని. ఎన్నడూ ఎవర్నీ దేనికీ దేహీ అని యాచించలేదు. అలాంటి వాణ్ణి, ఒక పెద్దమనిషి పరువు నిలబెట్టడం కోసం అప్పుచేయాలనుకున్నాను. అందుకు సెట్టి హామీ కావాలన్నాడు. వడ్డీ లేకుండా డబ్బిస్తానని తమరన్నా, నేను హామీ అడిగాను తప్ప మీవద్ద డబ్బడగలేదు. హామీ యిచ్చిన మీకు బెంగ లేకుండా, నా కూతురు పెళ్ళి జరిగి వారమైనా తిరక్కుండా సెట్టి బాకీ పూర్తిగా తీర్చేశాను," అన్నాడు నారాయణ.

''నువ్వు నీ గురించే చెప్పుకుంటున్నావు. నా గురించి ఏమీ చెప్పడం లేదు,'' అన్నాడు వీరభద్రం.

నారాయణ ఒక క్షణం ఆగి, ''బాబూ, ఇందులో నా గురించి తప్ప, మీ గురించి చెప్పడానికేముంది? నేను పౌరుషంగల వాణ్ణి. కాని, పెద్దమనుషుల పరువు నిలబెట్టడం కోసం, ఆ పౌరుషాన్ని కూడా చంపుకోగలను. హామీ యిచ్చినవాళ్ళకు, యిచ్చిన పేరూ వస్తుంది, నష్టమూ వుండదు. ఎన్నడూ ఎవర్నీ దేహీ అని అడగని నేను—మీ దగ్గిరకు వచ్చి సాయమడిగితే—అది మీ అదృష్ట మన్నమాట! మీరు చాలా అదృష్టవంతులు, బాబూ! అందుకే నేను, మీ దగ్గిరకు వచ్చాను,'' అన్నాడు.

వీరభద్రం తెల్లబోయి, ''ఇదా నువ్వు నా గురించి పదిమందిలో చెప్పదలచుకున్నది! నన్ను సాయమడిగి, నువ్వు నాకంటే గొప్పవాడిననుకుంటున్నావా?'' అని ప్రశ్నించాడు.

''బాబూ, నేను మొహమాటస్థుణ్ణి. తమరడిగారు కాబట్టి చెప్పానుగానీ, నా గురించి నేను అడక్కుండా ఎవరికీ చెప్పుకోను. అడగమని ఎవరికీ చెప్పను,'' అన్నాడు నారాయణ.

''ఇలాగని ముందే తెలిస్తే, నీకసలు నేను హామీ వుండేవాణ్ణే కాదు,'' అన్నాడు వీరభద్రం కోపంగా.

నారాయణ అక్కణ్ణించి కదలబోతూ ఆగి, ''అందుకే బాబూ, నేను కార్యం జయప్రదంగా ముగిసినాకే, తమకు విషయం చెబుతానన్నది,'' అని వెళ్ళిపోయాడు.

ఒక పెద్దమనిషి తన డబ్బు వాడుకుంటే, మౌనంగా అతడి గుట్టు కాపాడాడు నారాయణ. అలాంటి వాడు అప్పుకు హామీ అడిగితే, తనేదో గొప్ప ఘనకార్యం చేస్తున్నట్టు హడావిడి చేశాడు తను!

ఈ విషయం అర్థమయ్యాక, వీరభద్రం రచ్చబండ మీద కూర్చుని గొప్పలు చెప్పుకునే అలవాటు మానుకున్నాడు.





# కొత్త సేనాని

చంద్రపురి అనే రాజ్యాన్ని, చంద్రసేనుడనే రాజు పాలిస్తూండేవాడు. ఆ రాజ్యానికి పొరుగున వున్న చక్రగిరి రాజ్యానికి, చిత్రకేతుడనే ఆయన రాజు. ఆ రెండు రాజ్యాల మధ్యా ఎంతోకాలంగా శత్రుత్వమున్నది.

ఒకసారి చిత్రకేతుడు, ఏ యుద్ధ ప్రకటనా చెయ్యకుండా, చంద్రపురి రాజ్యంమీద దాడిచేశాడు. ఇరుపక్షాల మధ్యా ఘోరమైన యుద్ధం జరిగింది. చిత్రకేతుడు ఓడి అడవులపాలయ్యాడు. చక్రగిరి రాజ్యం, చంద్రసేనుడి వశమైంది.

అయితే, యుద్ధంలో చంద్రపురి సేనాధిపతి మరణించాడు. ఉపసేనాధిపతి అయిన శక్తివర్మ బాగా గాయపడ్డాడు. వైద్యులు అతడికి చికిత్సచేసి ప్రాణమైతే కాపాడగలిగారు గాని, ఒక కాలు శస్త్రం చేసి తీసివేయవలసివచ్చింది.

ఈ పరిస్థితుల్లో సైన్యానికి కొత్త సేనాధిపతి అవసరం ఏర్పడింది. రాజూ, మంత్రీ, శక్తివర్మను సలహా అడిగారు.

''మహారాజా, మన దళాధిపతుల్లో ధైర్యసాహసాలేకాక, యుద్ధ తంత్రం ఎరిగిన యువకులు కొందరున్నారు. వాళ్ళ మధ్య పోటీ పరీక్షలు పెట్టి, గెలిచిన అతడికి సేనాధిపతి పదవి యివ్వండి.'' అని సలహా యిచ్చాడు శక్తివర్మ.

రాజు ఆ పని శక్తివర్మకూ, మంత్రికీ అప్పగించాడు. వాళ్ళు దళాధిపతుల మధ్య పోటీలు నిర్వహించారు. అందులో అన్నిటా నెగ్గుకొచ్చినవాళ్ళు యిద్దరు. ఒకడి పేరు జయుడు. మరొకడి పేరు విజయుడు.

మంత్రికీ, శక్తివర్మకూ, యీ ఇద్దరిలో ఎవరిని సేనాధిపతిని చేయాలన్న చిక్కు సమస్య ఎదురైంది. మంత్రి బాగా ఆలో

కె. కె. రావు

చించి, శక్తివర్మకు ఒక ఉపాయం చెప్పి వెళ్ళిపోయాడు.

మర్నాడు జయుడు, మంత్రిని కలుసుకున్నాడు. మంత్రి, అతణ్ణి పరీక్షగా చూస్తూ, "నిన్ను సైన్యాధిపతిగా నియమించమని, రాజాజ్ఞ. నీ విధి నిర్వహణలో పూర్వపు సేనానాయకుణ్ణి మరిపించాలి, విజయా!" అన్నాడు.

మంత్రి మాటలు వింటూనే, జయుడు తత్తరపడుతూ, "మహామంత్రీ! నేను విజయుణ్ణికాదు; జయుడిని!" అన్నాడు.

"విడ్డూరంగా వున్నదే! విజయుణ్ణి ఎన్నికచేసి పంపుతున్నట్టు, శక్తివర్మ వర్తమానం పంపాడు," అన్నాడు మంత్రి.

"ఏదో పొరబాటు జరిగివుంటుంది. ఇప్పుడే వెళ్ళి, శక్తివర్మను తమ సన్నిధికి తీసుకువస్తా," అంటూ జయుడు గబగబా వెళ్ళిపోయాడు.

కొద్దిసేపటి తర్వాత విజయుడు, వచ్చాడు. మంత్రి అతడికేసి చూస్తూ, "రాజుగారి ఆజ్ఞ! ఈ క్షణంనుంచీ నువ్వు చంద్రపురి రాజ్యానికి సైన్యాధిపతివి. నీ విధి నిర్వహణలో, పూర్వపు సేనానాయకుణ్ణి మరిపించాలి, జయా!" అన్నాడు.

మంత్రి మాటలకు విజయుడు ఆశ్చర్యపోయి, "మహామంత్రీ! ఏదో పొరబాటు జరిగింది. శక్తివర్మ, నన్ను సేనానిగా ఎన్నికచేసినట్టు చెప్పి, మిమ్మల్ని కలుసుకోమన్నాడు. మీకు వర్తమానం పంపినట్టు చెప్పాడు. నా పేరూ, జయుడు పేర్ల మధ్య ఒక్క అక్షరమే తేడా. అందువల్ల, మీరు ఆలకించడంలో ఏదో లోపం జరిగివుంటుంది. ఇప్పుడే మీకు సందేహనివృత్తి చేస్తాను," అని, కాపలా భటుణ్ణి పిలిచి, "ఒరే, నువ్వు శక్తివర్మ దగ్గిరకు వెళ్లి, కొత్త సేనాధిపతి విజయుడు పిలుస్తున్నట్టు చెప్పి, తక్షణం యిక్కడికి తీసుకురా!" అని ఆజ్ఞాపించాడు.

ఇది చూసిన మంత్రి తృప్తిగా తలాడించి, "పొరబాటేమీ జరగలేదు, విజయా! ఈనాటినుంచి, నువ్వే రాజ్యానికి సేనాధిపతివి," అన్నాడు.



# సమయస్ఫూర్తి

ఒకసారి రాజొకడు అరణ్యానికి వేటకు వెళ్ళాడు. ఆయన వెంట కొందరు భటులతోపాటు విదూషకుడు కూడా వున్నాడు.

ఉదయంనుంచి మిట్టమధ్యాహ్నం వేళవరకు వెతికినా, వాళ్ళ కంటికి ఒక్క క్రూర మృగం కూడా కనబడలేదు. చివరకు ఒకచోట చెట్ల ఆకులు తింటూ రాజుకు ఒక లేడిపిల్ల కనిపించింది.

రాజు అత్రంగా వింటికి బాణం సంధించి లేడిపిల్లకేసి వదిలాడు. అయితే, బాణం గురి తప్పి, లేడి పక్కనుంచి దూసుకుపోయింది.

ఇది చూసి విదూషకుడు, "అద్భుతం, మహారాజా!" అన్నాడు.

రాజు కోపగించుకుని, "ఇలాంటి అభినందనలు అవమానంగా భావించవలసి వుంటుంది," అన్నాడు.

వెంటనే విదూషకుడు, "మహారాజా, నేను మెచ్చుకున్నది, బాణం కొట్టడంలో తమ నేర్పునుకాదు; కనికరాన్ని!" అన్నాడు.

రాజు ఎంతగానో సంతోషించి, విదూషకుడికి తన మెడలోని హారాన్ని బహూకరించాడు.

—టి. గురురామప్రసాద్





# బంగారులోయ

## 7

[జ్ఞానభూమి నుంచి అదృశ్యమైన వినోదుడు, మరొక కొత్త ప్రదేశంలో కొండపై ఉన్న గుహ లోపలి ముని సమక్షానికి చేరాడు. మునీ, వినోదుడూ గుహ నుంచి బయటకు వచ్చి, కొండ పాదతలంలో ఉన్న పట్టణంలో అదృశ్యంగా నడుస్తూ అక్కడి విశేషాలను చూస్తూ, ఒక ఆలయ ప్రాంగణంలో ప్రవేశించారు. ఆలయం తలుపులు మూయబడ్డాయి. —తరవాత]

ఆలయంలో ఉన్నవారిలో పొడవుగా ఉన్న పెద్దమనిషి, ''అదృష్టవశాత్తు, ఈ సంవత్సరం కూడా మనం అన్ని 'పాపాలనూ' పట్టి బంధించగలిగాము. అందరూ దృఢకాయులే. ఈ ఆహారంతో దేవత తప్పక ఆనందిస్తుంది,'' అన్నాడు ఎంతో సంతోషంగా.

''ఒక్కసారి వాళ్ళను చూద్దామా?'' అన్నాడు నాయకుడు.

ఆ పెద్దమనిషి వారినందరినీ ఒక బోను వద్దకు తీసుకుపోయి, ''వీడు దురాశ, వాడు క్రోధం, బెదురు చూపులు చూస్తున్న ఆ పొడవాటి గడ్డంవాడు లోభం,'' అంటూ బోనులోని ముగ్గురు దృఢకాయులను చూపాడు.

ఆ తరవాత, అధికారులు, ఆ ముగ్గురినీ బలి చేయడానికి ఉపయోగించనున్న తళతళ మెరుస్తూన్న కత్తిని చూశారు.

మనోజ్ దాస్



"ఈ పట్టణాన్ని సర్వనాశనం చేయాలి!" అన్నాడు ముని కోపావేశంతో.

ఆయన మాటలు వినోదుడికి తప్ప మరెవ్వరికీ వినిపించలేదు. వినోదుడు ముని కేసి ఆశ్చర్యంగా చూశాడు.

"నేను మనసులలోని దురాశ, క్రోధం, లోభం మొదలైన దుర్గుణాలను దేవత ఎదుట త్యజించమన్నాను. ఈ దుర్మార్గులు పరదేశీయులైన కొందరు అమాయకులను పట్టి బంధించి, వాళ్ళకు దురాశ, క్రోధం, లోభం అని పేర్లు పెట్టి దేవతకు బలి ఇస్తున్నారు!" అంటూ ముని గుడి ప్రాంగణం వదిలి కోపంగా వెలుపలకు నడిచాడు.

మరి కొంతసేపు పట్టణ సంచారం చేసేసరికి, వారికెన్నో సంగతులు తెలియ వచ్చాయి: పట్టణంలో పుచ్చకాయ వ్యాపారం బ్రహ్మాండంగా సాగుతున్నది. రోజూ సాయంకాలం పట్టణం నాయకుడు, కొండమీదికి వెళ్ళి—పొరుగు ప్రాంతాల నుంచి వచ్చిన వారితో సహా ఎంతమందికి సరిపడా పుచ్చకాయ కావాలో చెప్పి వచ్చే వాడు. పుచ్చకాయ అద్భుతంగా ప్రత్యక్ష మయ్యే తీరూ, దాని రుచీ రోజూ వేలకొలది మందిని ఆకర్షిస్తున్నది. ఉదయసూర్యుడి కిరణాలలో తళతళమెరిసే వింత పుచ్చ కాయను దర్శించడానికీ, అందులో ఒక ముక్కను తీసుకోవడానికీ—పొరుగూళ్ళ నుంచి వచ్చేవారినుంచి బాగా డబ్బు వసూలు చేస్తున్నారు. ఇలా తమ పూర్వీకుడికి లభించిన వరాన్ని ఉపయోగించి, సులభంగా ధనార్జన చేస్తూ, వాళ్ళు పొద్దస్తమానం నిద్రపోతూ, యేటా అమాయకులైన పరదేశీయుల్ని కొందరిని పట్టి, వారికి దుర్గుణాలని పేర్లుపెట్టి పట్టణదేవతకు బలి యిస్తూ ఉత్సవం జరుపుకుంటున్నారు!

సూర్యాస్తమయ సమయానికి మునీ, వినోదుడూ పట్టణ సంచారం ముగించి కొండమీదకు చేరారు. పుచ్చతీగ పక్కన ఉన్న బండమీద ఇరువురూ కూర్చున్నారు.

కొంతసేపటికి ముదురురంగు దుస్తులతో నాయకుడు కొండ ఎక్కి రావడం వాళ్ళకు కనిపించింది. యువకుడయిన ఆ నాయకుడు హుషారుగా ఈలవేస్తూ కొండ మీదికి వచ్చి, ఇన్నాళ్ళూ గుహద్వారానికి అడ్డంగా ఉన్న పెద్ద బండ అవతల పడి వుండడం చూసి ఆశ్చర్యపడ్డాడు. తరవాత గుహ లోపలికి తొంగిచూసి, "రేపు ఇరవై వేల మందికి సరిపడా పుచ్చకాయ కావాలి," అన్నాడు గట్టిగా.

"ఇరవైవేలమందికి సరిపడానా? మీ పట్టణ జనాభా అంత ఉన్నదా?" అని అడిగాడు ముని.

నాయకుడు వెనుదిరిగి చూశాడు. ఎదురుగుండా ఒక బండ మీద ముని కూర్చుని ఉన్నాడు. వినోదుడు పక్కనే నిలబడి ఉన్నాడు.

"మీరెవరు? ఇక్కడ మీకేం పని?" అని అడిగాడు నాయకుడు.

"ఈ గుహలో ఒక ముని ఉండేవాడనీ, ఆయనే ఈ వింత పుచ్చకాయ వరం ఇచ్చాడనీ నీకు తెలియదా?" అని ప్రశ్నించాడు ముని.

"ఆ విషయం విని ఉన్నాను. అయినా, అదంతా కట్టుకథ అనుకున్నాను," అన్నాడు నాయకుడు.

"రోజూ పుచ్చకాయ ప్రత్యక్షమవడం సత్యమైనప్పుడు, ఆ వరం ప్రసాదించిన ముని ఉదంతం మాత్రం కట్టుకథ ఎలా అవుతుంది?" అన్నాడు ముని.





నాయకుడు వెంటనే సమాధానం చెప్ప లేకపోయాడు.

ముని వినోదుడి కేసి తిరిగి, ''ఇదీ నాయనా, ప్రస్తుత విచిత్రపరిస్థితి. పువ్వుల అందం చూసి ఆనందిస్తారు. కాని వాటి అందచందాలను తీర్చిదిద్దిన సృష్టికర్తను గురించి ఆలోచించడం గానీ, పట్టించుకోవడం గానీ చేయరు,'' అన్నాడు బాధగా నిట్టూరుస్తూ.

అప్పుడు నాయకుడు, ''మహాత్మా! మీరుగుహనుంచి బయటికి రావడంచాలా ఆనందకరమైన విషయం. ఇంతకాలం గుహ జీవితం గడిపారు. ఇక నుంచి మీకు సకల సౌకర్యాలూ గల బ్రహ్మాండమైన భవనాన్ని నివాసంగా ఏర్పాటు చేస్తాం. ఎన్నేళ్ళుగానో మీరు ఆహారం చూసి ఉండరు. నాతో రండి. మీకు పంచభక్ష్య పరమాన్నాలతో విందు ఏర్పాటు చేస్తాను,'' అన్నాడు నవ్వుతూ.

''నేను అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఏవేవో మాట్లాడుతున్నావు. మీకు ఇరవైవేలమందికి సరిపడా పుచ్చకాయ అవసరమేమిటి?'' అన్నాడు ముని కోపంగా.

''మేము పదిహేనువేలమంది ఉన్నాం. చుట్టుపక్కల నుంచి ఇవాళ అయిదువేల మంది వచ్చారు. వాళ్ళకూ పుచ్చకాయ కావాలి. అందుకు తగిన విధంగా మేము వాళ్ళ నుంచి పైకం వసూలు చేస్తాం. కావాలంటే మీకూ ఆ ఆదాయంలో ఒక వాటా ఇస్తాం. ఇప్పుడు నాకొక బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది! పుచ్చకాయతో పాటు మీరు కూడా కొండ మీద కూర్చుని కొంతసేపు దర్శనం ఇచ్చినట్టయితే, ఆ దృశ్యం చూపి సులభంగా మరింత డబ్బు వసూలు చేయగలం. ఏమంటారు?'' అన్నాడు నాయకుడు పట్టరాని ఉత్సాహంతో.

''నోర్ముయ్,'' అన్నాడు ముని.

ఆ తరవాత ముని కొంతసేపు మౌనంగా కూర్చున్నాడు. సూర్యాస్తమయం కాబో

తున్నది. ఆకాశంలో పక్షులు బారులు బారులుగా ఎగురుతూ గూళ్ళకు చేరు కుంటున్నాయి.

"కొండ మీద పుచ్చకాయను సృష్టించి అద్భుతం ప్రదర్శిస్తే, ఈ ప్రజలు దాని వెనక ఉన్న దివ్యశక్తిని గ్రహించి, దైవ స్పృహగలవారుగా ఉండగలరనీ, ధర్మ బద్ధంగా తమ జీవితాలను దిద్దుకోగలరనీ ఆశించాను. అయినా, రోజూ సూర్య చంద్రులనూ, అంతరిక్షంలో వేలాడు తూన్న అనంతకోటి నక్షత్రగోళాలను చూసినా వీరి మనసులకు అద్భుతం అనిపించదు. అటువంటి వాళ్ళు కేవలం ఒక వింత పుచ్చకాయలో పరమార్థాన్ని గ్రహించగలరని ఆశించడం, నాదే పొర బాటు," అని బాధపడసాగాడు ముని తనలోతాను.

కొంతసేపటికి ముని కనుబొమలు ముడి పడ్డాయి. "రేపు ఆఖరుసారిగా నేను మీకొక బ్రహ్మాండమైన పుచ్చకాయను సృష్టిస్తాను. అది పగిలి బద్దలై మీమీద పడుతుంది. అదే మీ పట్టణాన్ని సర్వ నాశనం చేస్తుంది. ఇక వెళ్ళు!" అని నాయకుణ్ణి ఆజ్ఞాపించాడు ముని కోపా వేశంతో.

నాయకుడు కొండ దిగి పట్టణం కేసి నడిచాడు.



"మహాత్మా, మీ బెదిరింపు వాళ్ళలో మంచి మార్పు తీసుకురాగలదనుకుం టాను. వాళ్ళు తమ పొరబాటు గ్రహించ గలరు. ఇన్నాళ్ళు తమకు ఉన్న అమూల్య అవకాశాన్ని దుర్వినియోగం చేసినందుకు వాళ్లు బాధపడగలరనుకుంటాను," అన్నాడు వినోదుడు.

"అంత తొందరగా వాళ్ళు మారుతా రనుకోను. వెర్రి వెయ్యివిధాలు. కావా లంటే నువ్వు వెళ్ళి వాళ్ళిప్పుడేమి చేస్తు న్నారో చూసి రా," అన్నాడు ముని.

వినోదుడు కొండ దిగి పట్టణం చేరు కున్నాడు. అది పున్నమిరేయి. పిండార బోసినట్టు వెన్నెల కాస్తున్నది. పట్టణం



మధ్యగా ఉన్న ఒక మైదానంలో జనం గుమికూడి ఉన్నారు. వేదికలాంటి ఎత్తయిన స్థలం నుంచి నాయకుడు మాట్లాడుతున్నాడు. వినోదుడు ఆ గుంపును సమీపించాడు. నాయకుడి ప్రసంగం ఇలా సాగుతున్నది:

"ముని సవాలును మనం ఎలాగైనా ఎదుర్కొని తీరాలి. అతని పథకాన్ని కొనసాగనీయకూడదు. అందుకు ఒక్కటే మార్గం. రేపు వేకువజామునే మన పట్టణ ప్రజలూ, చుట్టుపక్కల ప్రాంతాలవాళ్లూ అందరం కలిసికట్టుగా కొండ దగ్గరికి చేరాలి. కొండ మీది నుంచి పుచ్చకాయ బద్దలై కిందికి పడగానే ఆ ముక్కలను అందుకుని అందరం తినేయాలి. ఆ తరవాత, ఆ పుచ్చకాయ ముక్కలు మన పట్టణాన్ని ఎలా నాశనంచేయగలవో చూద్దాం."

నాయకుడి ఉపన్యాసం విని అందరూ అమితోత్సాహంతో ఆమోదసూచకంగా తలలూపారు.

ఆ క్షణం నుంచే ఉదయం రానున్న అపాయాన్ని ఎదుర్కోడానికి ప్రజలందరూ అయత్తం కాసాగారు. పొద్దున పుచ్చకాయ ఎక్కువగా తినడానికి అనువుగా, వాళ్ళందరూ ఆ రాత్రి ఉపవాసం చేయడానికి నిశ్చయించారు. ఇరుగుపొరుగు ప్రాంతాల నుంచి వచ్చిన వేలకొలది ప్రజలు కూడా ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని ఉత్సాహంగా ఎదురు చూడసాగారు.

ఆ పట్టణప్రజల అజ్ఞానానికి బాధపడుతూ, వినోదుడు ముని దగ్గరికి చేరుకునేసరికి అర్ధరాత్రి దాటింది.

తూర్పున అరుణరేఖలు పొడిచేసరికల్లా, వేలకొలది ప్రజలు కొండ దిగువకు చేరి, నోళ్ళు తెరుచుకుని వరుసలు వరుసలుగా నిలబడ్డారు. కొండమీద, ఇంచుమించు ఆ కొండంత పరిమాణంలో బ్రహ్మాండమైన పుచ్చకాయ సూర్యకాంతిలో తళతళ మెరుస్తూ ప్రజల హృదయాలలో భయోత్సాహాలను కలిగించింది.

హఠాత్తుగా పుచ్చకాయ వేనవేల ముక్కలుగా బద్దలై జనం మీద పడింది. ప్రజలు పట్టరాని ఉత్సాహంతో కేకలు పెడుతూ ఒకరితో ఒకరు పోటీపడి, పుచ్చకాయ ముక్కలను తినసాగారు. కింద ప్రవహించిన రసాన్ని జుర్రుకుని తాగేశారు. గంటసేపట్లో అక్కడక్కడా పుచ్చకాయ ముక్కల పైతొక్కలు తప్ప మరేమీ మిగలకుండా ఖాళీ చేసేశారు.

ఆ తరవాత, ప్రజలందరూ గుమికూడి, తమనుతాము గొప్పగా ప్రశంసించుకుంటూ ఒక తీర్మానం నెరవేర్చారు. కొంతసేపటికి పొరుగూరువాళ్ళు క్రమంగా అక్కణ్ణించి వెళ్ళసాగారు. మధ్యాహ్నంకల్లా కొంత కింది ప్రాంతం దాదాపు నిర్మానుష్యమయింది. పట్టణవీధుల్లో కూడా జనసంచారం పలచబడింది.

పట్టణప్రజలలో, కొందరు, పుచ్చకాయను అమితంగా తినడంవల్ల అజీర్ణం పట్టుకున్నది. ఈ రోజుతో పుచ్చకాయ రావడం ఆగిపోయింది. రేపటి నుంచి తమ ఆహారం ఏమిటి? అన్న దిగులు కొందరికి పట్టుకున్నది. తరతరాలుగా వాళ్ళకు తెలిసిన జీవనోపాధి ఒక్క పుచ్చకాయ వ్యాపారం మాత్రమే. అందువల్ల రేపటి నుంచి బతకడం ఎలా అన్నది పెద్దసమస్య అయింది.

వాళ్ళలో పెద్దలు కొందరు, "మునీశ్వరుడు, పుచ్చకాయ బద్దలై పట్టణాన్ని నాశనం చేస్తుందనే కదా అన్నాడు. అంటే—ఆ పుచ్చకాయ బద్దలై పట్టణాన్ని నాశనం చేస్తుందని కాదు భావం. బద్దలైన పుచ్చకాయే ఆఖరుది; రేపటి నుంచి పుచ్చకాయ రాదు కాబట్టి, పట్టణం దానంతట అదే నశించిపోతుందనే అర్థం," అని వ్యాఖ్యానించసాగారు.

సాయంకాలమయింది. ఉదయం నుంచి అదృశ్యంగా ఉంటూ ఈ విశేషాలన్నీ చూసిన మునీ, వినోదుడూ—విచారవదనాలతో ఉన్న పట్టణ ప్రజలను వదిలి, వాళ్ళకు తెలియకుండా దూరంగా వెళ్ళిపోయారు. —(ఇంకావుంది)






# చిత్రమైననిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, భీతికొలిపే, యీ శ్మశానంలో అర్ధరాత్రి వేళ, నువ్వు ఎన్నో శ్రమలకోర్చి సాధించ దలచిన కార్యం, నీ కోసమా లేక నీ ఆత్మ బంధువులకోసమా అన్న అనుమానం కలుగుతున్నది. ఒకవేళ యిదంతా, నీ ఆత్మబంధువులకోసమైతే, కార్యం నెర వేరాక వాళ్ళు నీపట్ల గౌరవాభిమానాలు చూపగలరన్న నమ్మకం ఏమిటి? ఇందుకు ఉదాహరణగా నీకు, ఒక రాజూ, ఆయన కుమారుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

మహేంద్రగిరి రాజైన పద్మపాదుడికి, ప్రవీణుడనే కుమారుడుండేవాడు. లేక

బేతాళ కథలు



లేక కలిగిన సంతానం కావడంతో, పద్మపాదుడికి తన కొడుకంటే వల్లమాలిన ప్రేమ.

ప్రవీణుడికి ఐదేళ్ళు నిండాక అక్షరాభ్యాసం జరిపించి, సిద్ధముని గురుకులంలో చేర్పించాడు పద్మపాదుడు. ప్రవీణుడు రాజు కొడుకు కావడంవల్ల, సిద్ధముని అతణ్ణి గౌరవభావంతో చూసేవాడు. మిగతా విద్యార్థులకు వెదురుబియ్యం, కందమూలాలు ఆహారమైతే, ప్రవీణుడికి మాత్రం పంచభక్ష్యాలతో వడ్డన జరిగేది. బోధన సమయంలో తోటివిద్యార్థులు నేలపై కూర్చుంటే, ప్రవీణుడు మెత్తని తివాసీపై కూర్చునేవాడు.

సిద్ధముని, తాను అడిగిన ప్రశ్నలకు సరిఅయిన జవాబులు చెప్పలేని విద్యార్థులను కఠినంగా శిక్షించేవాడు. ప్రవీణుణ్ణి మాత్రం, "యువరాజా, తమరు చదువుపై మరింత శ్రద్ధ వహించాలి!" అని చెప్పి వూరుకునేవాడు.

కొంతకాలంపాటు ప్రవీణుడికి గురుకుల విద్యాభ్యాసం బావున్నట్టనిపించింది. క్రమంగా అతడు పన్నెండేళ్ళవాడై, సిద్ధమునిచేత తాను రాజు కొడుకుగా గౌరవించబడుతున్నట్టు తెలుసుకుని ఆవేదన చెందాడు. ఈ కారణంగా, తాను యితర విద్యార్థులకన్న చదువులో వెనకబడ్డట్టు గ్రహించి, ఒకనాడు గురువును, "ఇతర విద్యార్థులకూ, నాకూ మధ్య యీ భేదభావం ఎందుకు చూపుతున్నారు?" అని అడిగాడు.

అందుకు సిద్ధముని, "ఇక్కడే కాదు, మరే గురుకులంలో అయినా, నీకీ మర్యాదలు తప్పవు, యువరాజా!" అని జవాబిచ్చాడు.

ఆ మర్నాడు ప్రవీణుడు ఎవరికీ తెలియకుండా గురుకులాన్ని విడిచి, అక్కడికి ఎంతో దూరంలో వున్న జ్ఞానముని అనే గురువు దగ్గిర చేరి, ఆయనకు శుశ్రూషలు చేస్తూ, కందమూలాలు తింటూ, సాధారణ విద్యార్థిలాగా విద్యాభ్యాసం చేయసాగాడు.

ఆ గురుకులంలో ప్రవీణుడికి, వల్లభు డనే ఒక విద్యార్థితో మంచి స్నేహం ఏర్ప డింది.

కొద్దికాలం తర్వాత, ప్రవీణుడి కోసం వెతుకుతున్న వేగులకు, జ్ఞానముని గురు కులంలో సామాన్య విద్యార్థిలా జీవిస్తున్న ప్రవీణుడు కనిపించాడు. వాళ్ళు ప్రవీణు డితోపాటు జ్ఞానమునిని కూడా, రాజు పద్మపాదుడి వద్దకు తీసుకుపోయారు.

జరిగింది విని పద్మపాదుడు ఆగ్ర హించి, ''అహంకారం కొద్దీ, ఒక రాజు కొడుకు చేత కందమూలాలు తినిపించి, పాదసేవ చేయించుకుంటావా? కాబోయే రాజును అవమానిస్తే, ఆ రాజ్యాన్నే అవ మానించినట్టని న్యాయశాస్త్రాలు చెబు తున్నవి. నీకు జీవితఖైదు విధించాను!'' అన్నాడు.

జ్ఞానముని తాను నిరపరాధిననీ, ప్రవీ ణుడు యువరాజన్న సంగతి తనకు తెలియదనీ ఎంత మొరబెట్టుకున్నా, కొడుకు మీది ప్రేమతో పద్మపాదుడు వినిపించుకోలేదు.

మరి పన్నెండేళ్ళు గడిచినై. ప్రవీణుడు యుక్తవయస్కుడయ్యాడు. ఒకనాడు అతడికి రాజ్యంలోని ప్రజలు తన తండ్రి పాలనను గురించి ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలనిపించింది.



అతడు రథాలుతోలే సారథుల్లో ఒకణ్ణి పిలిచి, ''నువ్వు నాలాగా వేషం వేసుకుని రథంలో కూర్చో. నేను సారథివేషంలో రథం తోలుతాను. ఇందువల్ల ప్రజలు ఏమనుకుంటున్నదీ తెలుసుకునే అవ కాశం, నాకు కలుగుతుంది,'' అన్నాడు.

సారథి యిందుకు ఒప్పుకోలేదు. ప్రవీణుడు, ''నేను ఆజ్ఞాపిస్తున్నాను. చెప్పినట్టు చెయ్యి,'' అన్నాడు ఆగ్రహంతో.

సారథి చేసేదిలేక యువరాజు వేషం ధరించాడు. ప్రవీణుడు సారథి వేషంలో రథాన్ని నడుపుతూ, నగర పొలిమేరలను చేరి, అక్కడ ఒక చెట్టు కింద రథాన్ని ఆపాడు.

ప్రవీణుడికి సమీపంలో, ఒక పూరిపాక కనిపించింది. ఆ పాకలో ఒక పేదరాలు నివసిస్తున్నది. ఆమె కొడుకు తీవ్రమైన జ్వరంతో బాధపడుతున్నాడు. పేదరాలు, వాడికి దాహం యిస్తున్నది.

ఆ సమయంలో ప్రవీణుడు పాక గుమ్మం ముందుకుపోయి, పేదరాలిని, "అమ్మా, యీ దేశపు యువరాజు, ఆ కనబడే చెట్టుకింద రథంలో వున్నాడు. దాహంగా వున్నదట, మంచినీళ్ళివ్వ గలవా ?" అని అడిగాడు.

అది వింటూనే పేదరాలి కొడుకు కంగారుపడిపోతూ, "అమ్మా, ముందు యువరాజుగారికి దాహం యిచ్చిరా. అలా చేయకపోతే, రాజుగారు తమ కొడుక్కు అడగగానే మంచినీరివ్వలేదని, జ్ఞాన మునిని శిక్షించినట్టు నిన్నూ శిక్షించగలడు. రోగిష్టినైన నేను, నిన్ను కూడా పోగొట్టు కుని దిక్కులేని చావు చావవలసి వస్తుంది," అన్నాడు.

ఆ మాటలు, సారథి వేషంలో వున్న ప్రవీణుడికి చాలా బాధ కలిగించినై. అతడు కలతచెందిన మనసుతో రథం ఎక్కి, కొంతదూరం వెళ్ళాక, ఒక మలుపులో రెండు రథచక్రాలూ ఊడిపోయి, రథం తలకిందులైంది. ఆ ప్రమాదంలో సారథితోపాటు ప్రవీణుడికి కూడా బలమైన గాయాలు తగిలినై.

జరిగినదానికి రాజు పద్మపాదుడు ఆగ్రహించి, సారథిని దోషిగా నిలబెట్టి,



''ఒరే, నువ్వు యువరాజు స్థానంలో కూర్చుని, యువరాజుచేత రథం నడిపించడం రాచరికాన్నే అవమానించినట్టు. ఇందుకుగాను నీకు, పదేళ్ళ కఠిన కారాగారశిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు.

ఆ తర్వాత ప్రవీణుడు తండ్రిని ఏకాంతంగా కలుసుకుని, తన ప్రోత్సాహకారణంగానే సారథి తన వేషం వేసుకున్నాడని చెప్పి, వాడి శిక్ష రద్దు చెయ్యమని కోరాడు.

అయినా పద్మపాదుడు అందుకు ఒప్పుకోక, ''అభంశుభం తెలియని నువ్వు చెప్పగానే, ఆ సారథి నీ స్థానంలో కూర్చుని, యీ ప్రమాదానికి కారణం అయ్యాడు. ప్రమాదంలో జరగరానిది జరిగి, నిన్ను కోల్పోయివుంటే—నేను బతికివుండేవాడినా!'' అన్నాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకు, ఒక రాత్రివేళ కాపలావాళ్ళ కళ్ళు గప్పి ఒకడు అంతఃపురంలో ప్రవేశించాడు. వాడు తిన్నగా యువరాజు శయనాగారం చేరి, అతణ్ణి చురకత్తితో పొడిచిచంపబోయాడు.

అయితే, మెలకువగా వున్న ప్రవీణుడు, వాణ్ణి వడుపుగా పట్టుకుని చురకత్తి లాక్కున్నాడు. తర్వాత నిశితంగా వాణ్ణి పరిశీలించి, అతడు ఆశ్చర్యపోతూ, ''నువ్వా, వల్లభా!'' అన్నాడు.

అందుకు వాడు, ''అవును, యువరాజా, నేను వల్లభుడినే. నీవల్ల గురువుగారికి తీరని ద్రోహం జరిగింది. అయినా,





అప్పట్లో నీది తెలియని వయసు గనక, నీ దోషం ఏమీ లేదనుకున్నాను. కాని, నువ్వు పెద్దవాడివై కూడా గురువుగారిని కారాగారం నుంచి విడిపించక మౌనంగా వుండిపోయావు. నిన్ను చంపి, మితిమీరిన ప్రేమతో నీకోసం ఎటువంటి ఘోరకార్యం చేయడానికైనా వెనుదీయని, నీ తండ్రికి చక్కని గుణపాఠం నేర్పాలనుకున్నాను. అందుకే, నిన్ను నీడలా వెంటాడుతూ, నీ రథచక్రాల చీలలు ఊడబెరికి నిన్ను ప్రమాదానికి గురి చేశాను,'' అన్నాడు ఆవేశంగా.

ప్రవీణుడు ఏదో జవాబు చెప్పబోతున్నంతలో, కాపలాభటులు అక్కడికి వచ్చి, వల్లభుణ్ణి బంధించి తీసుకుపోయారు. రాజు పద్మపాదుడు అప్పటికప్పుడు విచారణచేసి, వల్లభుడికి ఉరిశిక్ష విధించి, తెల్లవారాక అమలు చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

అయితే, ఆ రాత్రే అందరినీ ఆశ్చర్య పరిచే విధంగా, ప్రవీణుడు ఒక చిత్రమైన నిర్ణయం తీసుకున్నాడు. అతడు రాజ్యంలోని మొత్తం సైన్యాన్ని తన అధీనంలోకి తీసుకుని, తండ్రిని గృహనిర్బంధంలో వుంచి, అప్పటికప్పుడే తను రాజుగా ప్రకటించుకున్నాడు.

తర్వాత అతడు, వల్లభుడి ఉరిశిక్ష రద్దు చేసి, జ్ఞానమునినీ, సారథినీ కారాగార విముక్తుల్ని చేసి, వాళ్ళతో, ''నా కారణంగా, మీ ముగ్గురూ చేయని నేరానికి శిక్షాపాత్రులయ్యారు. అందుకు మన్నించకోర్తాను. ఇకనుంచి మీరు పరిపాలనలో నాకు సాయం చేస్తూ, నా తప్పులను సరిదిద్దుకునేలా చేయండి,'' అన్నాడు.

ఇందుకు జ్ఞానమునీ, సారథీ ఒప్పుకోక అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

అప్పుడు ప్రవీణుడు, వల్లభుడితో, ''నిన్ను, నాకు అంతరంగిక సలహాదారుగా వుండవలసిందిగా వేడుకుంటున్నాను,'' అన్నాడు.

వల్లభుడు వెంటనే తన అంగీకారం తెలిపాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ప్రవీణుడు తననెంతగానో ప్రేమించే కన్న తండ్రినే ఎందుకు నిర్బంధించినట్టు? తనపై రెండుసార్లు హత్యాప్రయత్నం చేసిన వల్లభుణ్ణి ఉరితియ్యకపోగా, ఏ కారణంవల్ల తన అంతరంగికుడుగా నియమించుకున్నాడు? జ్ఞానమునీ, సారథీ ప్రవీణుడికి సాయపడేందుకు నిరాకరించడంలోని అంతర్యమేమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రవీణుడు మారువేషంలో వుండి, పేదరాలి రోగిష్టి కొడుకు అన్న మాటలు విన్నప్పటి నుంచీ, తన తండ్రి మితిమించిన పుత్రవాత్సల్యం కారణంగా, లోకనిందకు గురి అవుతున్నాడని కొంతవరకు గ్రహించాడు. ఆ తర్వాత సారథి విషయంలో కూడా, తానతడు నిర్దోషి అని చెప్పినా వినక, వాడికి కారాగారశిక్ష విధించాడు, రాజు. ఈ దశలో తనను హత్య చేయవచ్చిన గురుకులం నాటి మిత్రుడు వల్లభుడు, గురువైన జ్ఞానముని కారాగారవాసం గురించి చెప్పి, ప్రవీణుడికి జ్ఞానోదయం కలిగించాడు. తన తండ్రి రాజుగా వున్నంతవరకూ, ఎవరికీ న్యాయం జరగదన్న నిర్ణయానికి వచ్చిన ప్రవీణుడు, వెంటనే తనను రాజుగా ప్రకటించుకుని, ఆయనను గృహనిర్బంధంలో వుంచాడు. ఇక, జ్ఞానమునీ, సారథులు ప్రవీణుడి కొలువులో వుండ నిరాకరించడం, వాళ్ళకు రాజులసేవ ప్రమాదాలకు దారి తీస్తుందన్న భయం తప్ప మరేం కాదు. వల్లభుడు మాత్రం, ప్రవీణుడిలో వచ్చిన మార్పును సరిగా అర్థం చేసుకుని, అతడు కోరినంతనే, అంతరంగిక సలహాదారుగా వుండడానికి అంగీకరించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ఆత్మాహుతి

ధర్మగిరి రాజుగారి ఖజానాలోనుంచి వెయ్యి బంగారు నాణాలు, ఎవరో దొంగిలించారు. ఆ దొంగను పట్టుకునే బాధ్యత యుక్తివర్మకు అప్పగించాడు రాజు. అయితే, యిందుకాయన, ఒక షరతు పెట్టాడు. యుక్తివర్మ దొంగను రెండవరోజు సూర్యాస్తమయం లోపల పట్టుకోవాలి. అలా చేయలేకపోతే, యుక్తివర్మ సంకోచించకుండా ఆత్మాహుతి చేసుకోవాలి.

ఇందుకు యుక్తివర్మ ఒప్పుకుని, "మహారాజా, ఒకవేళ నేను దొంగను పట్టుకోలేకపోతే, నా ఆత్మాహుతి తర్వాత అతణ్ణి మంత్రుల్లో ఒకడుగా నియమించాలి. ఎందుకంటే—దొంగతనం చేసి, నా అంతవాడికే పట్టుబడలేదంటే, అతడు మహామేధావి అయివుండాలి," అన్నాడు.

రెండవరోజు సూర్యాస్తమానం కావడానికి, యింకా కొన్ని ఘడియలే వున్నాయి. ఆ సమయంలో నిండుకొలువు దీరివున్న రాజుగారితో యుక్తివర్మ, "మహారాజా, నాకు దొంగ పట్టుబడలేదు. నేను ఆత్మాహుతి చేసుకోబోతున్నాను. నేను కోరిన విధంగా, ఆ దొంగను మంత్రిని చేసి, నా ఆత్మకు శాంతి కలిగించండి," అన్నాడు.

"అయితే, నన్ను మంత్రిగా నియమించండి, మహారాజా!" అంటూ కోశాధికారి ఆనందంగా లేచి నిలబడ్డాడు.

రాజుగారు ఆజ్ఞాపించగానే, భటులు కోశాధికారిని బంధించారు. యుక్తివర్మను ఎంతగానో మెచ్చుకుని, రాజు అతణ్ణి మంత్రిగా నియమించి సత్కరించాడు.

—వడ్లమన్నాటి కుటుంబరావు





కావ్యకథలు:

# రాక్షసముద్రిక-1

ఒకానొకప్పుడు సర్వార్థసిద్ధి అనే రాజు పాటలీపుత్రం రాజధానిగా మగధ రాజ్యాన్ని పరిపాలించేవాడు. ఆయన కొలువులో సర్వసమర్థుడైన రాక్షసుడనే మంత్రి ఉండేవాడు. మంత్రి సలహాల కారణంగా రాజ్యపాలన ఏలోపమూ లేకుండా సాగేది.

రాజుకు ఇద్దరు భార్యలు. క్షత్రియవనిత అయిన మొదటి భార్య కుమారులు నందులు; శూద్రస్త్రీ అయిన రెండవ భార్య ముర కొడుకు మౌర్యుడు. అనమాన ప్రతిభాశాలిగా పేరు గాంచిన మౌర్యుడు రాజుగారి సేనాధిపతిగా ఉండేవాడు.





మౌర్యుడి కుమారుడు చంద్రగుప్తుడు బాల్యం నుంచే తెలివితేటలలోనూ, ధైర్యసాహసాలలోనూ మేటిగా పేరొందాడు. గుర్రపుస్వారీ, అస్త్రవిద్య మొదలైన క్షాత్రవిద్యలలో నందుల కన్నా గొప్పవాడుగా అందరి మన్ననలూ పొందాడు.



రాజు సర్వార్థసిద్ధికి అవసానకాలం ఆసన్నమయింది. మరణసమయంలో, సర్వార్థసిద్ధి తన సింహాసనానికి వారసులైన నందుల కన్నా, చిన్న కుమారుడైన మౌర్యుడిపట్ల ఎంతో ఆప్యాయతను కనబరిచాడు. ఇది నందుల హృదయాలలో మౌర్యుడిపట్ల ఈర్ష్యను రేకెత్తించింది.

రాజు మరణానంతరం, నందులు మౌర్యుడి కుటుంబాన్ని హతమార్చడానికి కుట్రపన్నారు. ఒకనాటి అర్ధరాత్రి సమయంలో మౌర్యుడి గృహాన్ని చుట్టుముట్టి, మౌర్యుణ్ణి భార్యా పిల్లలతోసహా పాతాళగృహంలోకి నడిపించి బంధించారు.





పాతాళగృహంలో ఉన్న మౌర్యుడి కుటుంబానికి, నందుల సేవకుడొకడు, రోజూ ఒక్కరికి మాత్రం సరిపోయే ఆహారం, నీళ్ళూ మాత్రం ఒక బిలంగుండా అందజేస్తూ వచ్చాడు.

ఒకరికి సరిపోయే ఆహారాన్ని అందరూ పంచుకుంటే ఏ ఒక్కరికీ సరిపోదు; అందరూ మరణించవలసి వుంటుంది. అందువల్ల ఆ ఆహారాన్ని రోజూ ఏ ఒక్కరు మాత్రమే తీసుకుని అతడు మాత్రం ప్రాణాలతో బయటపడి నందులపై పగదీర్చుకోవాలని వాళ్ళు నిర్ణయించారు. ఆ నిర్ణయం ప్రకారం చంద్రగుప్తుడు మాత్రమే ఆహారం తీసుకుంటూ వచ్చాడు.





నందులలో పెద్దవాడు మగధసింహాసనాన్ని అధిరోహించాడు. కొన్నాళ్ళు గడిచింది. ఒకనాడు వంగ రాజ్యం నుంచి ఒక రాయబారి వచ్చాడు. అతడు తమ రాజు పంపాడని ఒక సమస్యను తెచ్చాడు. దానిని సభలోని పండితులను వివరించవలసిందిగా కోరాడు. కాని, ఎవరూ ఆ సమస్యకు సరైన వివరణ ఇవ్వలేకపోయారు.

నందుడి మంత్రులలో ఒకడు, "కారాగారంలో వున్న మన చంద్రగుప్తుడు ఇటువంటి సమస్యలను పూరించడంలోనూ, వివరించడంలోనూ కడు సమర్థుడు. అతనిని రప్పిస్తే మన గౌరవం దక్కుతుంది," అని రాజుకు సలహా ఇచ్చాడు. రాజుకు అది నచ్చింది.





కారాగారం తలుపులు తెరవబడ్డాయి. ఒక్క చంద్రగుప్తుడు మాత్రమే ప్రాణాలతో ఉన్నాడు. సరిగ్గా ఒక్క సంవత్సరం తరవాత, చంద్రగుప్తుడు బయటి ప్రపంచాన్ని చూడగలిగాడు. అతనికి స్నానపానాదులు కావించి, రాజోచితమైన దుస్తులు ధరింపజేసి, విషయం తెలియజేశారు.

చంద్రగుప్తుడు రాజసభకు వచ్చాడు. వంగరాజ్యం నుంచి రాయబారి తెచ్చిన సమస్యను చదివి చిటికెలో దానికి వివరణ తెలియజెప్పాడు. సభాసదులు పరమానందం చెందారు. చంద్రగుప్తుడి ప్రతిభను వేనోళ్ళ కొనియాడారు.





సభాసదులు, అమితోత్సాహంతో చంద్ర గుప్తుణ్ణి, ఏనుగు మీద కూర్చొబెట్టి ఊరేగింపుగా అతని గృహానికి తీసుకుపోయి దిగబెట్టారు. చంద్రగుప్తుడికి ఆకస్మికంగా ప్రజల మధ్య ఏర్పడిన మంచి పేరు కారణంగా, నందులు అతణ్ణి మళ్ళీ కారాగారంలో బంధించలేకపోయారు. —(ఇంకావుంది)



# కుద్రపిశాచి కోరిక

త్రిమ్మలచెరువు అనే ఊరుకు ఉత్తరాన, ఒక చింతతోపున్నది. అదిదాటి వెళితే, ఒక ఎత్తయిన గుట్ట. ఆ గుట్ట మీద పురాతన దుర్గగుడి వున్నది. ఆ చింతతోపులోకి కొత్తగా ఒక కుద్రపిశాచం వచ్చి చేరింది. దానికి ఊళ్ళో జనం తోపుదాటి, గుట్ట ఎక్కి, దేవీదర్శనం చేసుకుపోవడం, ఆశ్చర్యంతోపాటు బాధకలిగించింది.

''దారిలో పట్టపగలే చీకటి గుయ్యారంగా వుండే, యీ చింతతోపులో, యింత ఎత్తు చింతచెట్టు మీద నేనుండగా, మనుషులు తోపుదాటి గుట్ట ఎక్కడమెందుకు? వాళ్ళకేవైనా కష్టాలుంటే, నేను తీర్చలేనా ?'' అనుకున్నది కుద్రపిశాచి.

ఆ ఊళ్ళో వున్న ఒక ధనికుడు, ఒక మధ్యతరగతివాడు, ఒక పేదరాలు— రోజూ తప్పనిసరిగా దేవీదర్శనం చేసుకుని వెళుతూండేవాళ్ళు.

ఒకనాడు ధనికుడు, దేవీదర్శనం చేసుకుని చీకటిపడి తిరుగుప్రయాణమయ్యాడు. ఆయన చింతతోపు ప్రవేశించగానే, కుద్రపిశాచం చెట్టు మీది నుంచి ఆయన ముందుకు దూకి, ''పాపం, శ్రమపడి రోజూ యింతదూరం వస్తున్నావు. ఆ దేవి నీ కష్టం తీర్చిందా, ఆర్చిందా! నేను చిటికెలో, నీ కష్టాలన్నిటినీ మటుమాయం చేయగలను,'' అన్నది.

ముందు పిశాచాన్ని చూసి భయపడిన ధనికుడు, ధైర్యం తెచ్చుకుని, ''ఏం చెప్పమంటావ్, నా కష్టం గురించి! కట్టుకుపోయేంత ఆస్తి వున్నది. అయితే నేం, కంటికి కునుకులేదు. ప్రతిరాత్రీ జాగరణ చేస్తూ నరకం అనుభవిస్తున్నానంటే నమ్ము!'' అన్నాడు నిట్టూర్చుతూ.

అతడి కష్టానికి, మూలకారణం పసిగట్టిన కుద్రపిశాచి, ''ఈ రాత్రితో, నీ కష్టం

మాచిరాజు కామేశ్వరరావు



గట్టెక్కినట్టే! అయితే, ప్రతిఫలంగా నాకు, ఆ దుర్గాదేవిగుడిలాంటిదే, యీ చింతతోపులో ఒకగుడికట్టించాలి," అన్నది.

"అదెంతపని! నా కష్టం తీరాలేగాని, నీకు గుడి కట్టించడం క్షణాల మీద జరిగి పోతుంది." అని ధనికుడు వెళ్ళిపోయాడు.

కొంత సేపయాక, మధ్యతరగతివాడు తోపులో ప్రవేశించాడు.

కుర్రపిశాచం, "భయపడకు!" అంటూ అతడి ముందుకు వెళ్ళి, "రోజూ క్రమం తప్పకుండా గుడికి పోతున్నావు. అయినా, ఆ దేవి నీ కోరిక తీర్చినట్టులేదు," అన్నది.

"దేనికైనా ప్రాప్తం వుండాలి గదా!" అన్నాడు మధ్యతరగతివాడు.

"ఊకదంపుడు కబుర్లాడకు. నీబోటి వాడి కోరిక ఏమై వుంటుందో, నేను చిటికెలో గ్రహించగలను. నీ కోరిక నెరవేరినట్టే. అయితే, నా కోసం ఈ తోపులో ఒక ధనికుడు గుడి కట్టిస్తానన్నాడు. రోజూ అందులో దీపం పెట్టే బాధ్యత మాత్రం, నీదేసుమా!" అన్నది కుర్రపిశాచం ఎంతో ఉత్సాహంగా.

"నా కోరిక తీరాలేగానీ, గుడిలోనే ఏం ఖర్మ—ఇంట్లో కూడా నీ పేరు చెప్పుకుని దీపం పెట్టుకుంటాను. నాకు పాతికేళ్ళ వయసు గల కూతురున్నది. కట్నం యిచ్చుకోలేకపోవడంతో దాని పెళ్ళి జరగడం లేదు. అది గుండెల మీద కుంపటిలా తయారైంది, నా ప్రాణానికి!" అన్నాడు మధ్యతరగతివాడు.

"ఇంత చెప్పాలా? నీకొచ్చిన కష్టమేదో ముందే తెలుసుకున్నాను. నీ కష్టం కడతేరింది. ఇంటికి వెళ్ళి చూసుకో," అన్నది కుర్రపిశాచం.

మధ్యతరగతివాడు వెళ్ళిన కొద్దిసేపటికి, ఒక పేదరాలు అటుగా వచ్చింది.

పిశాచం ఆమెను పరామర్శించి, "నీ కష్టం తీరుస్తాను. ఈ తోపులో కట్టబోయే, నా గుడి దగ్గిరికి, మీ పేటవాళ్ళను తెచ్చి జాతరలూ, సంబరాలూ చేయించాలి!" అన్నది.

అందుకు పేదరాలు, "కష్టం తీరాలే గాని, జాతరలో నేను నాట్యం కూడా చేస్తాను. నా మొగుడు తాగుబోతు. ఏ పనీ చెయ్యడు. నేను కష్టపడి తెచ్చిన డబ్బు, కొట్టి లాక్కుపోతాడు," అన్నది కన్నీళ్లతో.

"ఇక నీకా బాధలేదు. ఇంటికిపో," అన్నది పిశాచి.

తరవాత అది, తన కోసం ఆ తోపులో గుడి వెలిసినట్టూ, ఎక్కడినించో జనం తండోపతండాలుగా వచ్చి తనను కొలుస్తున్నట్టూ కలలుకన్నది.




మర్నాడు చీకటిపడుతూనే, తోపులో ప్రవేశించిన ధనికుణ్ణి చూస్తూ, "రాత్రి బాగా నిద్రపట్టిందా? నా గుడికి శంకుస్థాపన ముహూర్తం ఎప్పుడు పెట్టిస్తున్నావు?" అని అడిగింది కుర్రపిశాచి.

ధనికుడు కోపంతో, "ముందు నీ భూస్థాపితానికి ముహూర్తం పెట్టిస్తాను. నాకు రాత్రుల్లో నిద్రపట్టక పోవడానికి కారణం డబ్బని, దాన్ని బొగ్గులుగా మారుస్తావా? మళ్లీ నా సంపద ఎప్పటిలా మార్చు. చేయక పోయావే, మంత్రగాణ్ణి రప్పించి నిన్ను భూస్థాపితం చేయిస్తాను," అన్నాడు.

భూస్థాపితం అన్న మాటకు, పిశాచం హడలిపోయి, "బాబ్బాబు, అంత పని చెయ్యకు! ఇంటికి వెళ్ళి చూసుకో, తిరిగి అంతా మునుపటిలా వుంటుంది," అన్నది.

తర్వాత అటు వచ్చిన మధ్యతరగతి వాణ్ణి, పిశాచం, "నీ కష్టం తీరింది కదా! మరి దీపం పెట్టుకునేటప్పుడు, నా పేరు చెప్పుకున్నావా లేదా?" అని అడిగింది.

"నీ కోసం దీపం కాదు, హోమం పెట్టిద్దామనుకుంటున్నాను. మా అమ్మాయికి పెళ్ళి చేయలేకపోతున్నానని చెబితే, దాన్ని అబ్బాయిగా మారుస్తావా? కొత్తగా వచ్చిన మీసాలు చూసుకుని, అది సిగ్గుతో చితికిపోతున్నది. దాన్ని మామూలుగా మారుస్తావా లేదా?" అన్నాడు ఆవేశపడిపోతూ.

హోమం పేరు వింటూనే, కుర్రపిశాచి అదిరిపడి, పెద్దమనిషికి చేతులు జోడిస్తూ,

''నాకు హోమం పెట్టించకు. ఇంటికి వెళ్ళి చూసుకో. అంతా మామూలుగానే వుంటుంది,'' అన్నది.

అతను వెళ్ళిపోయిన పావుగంటకల్లా, పేదరాలు బిగ్గరగా అరుస్తూ పిశాచి దగ్గిరకు వచ్చింది. పిశాచి ఆవిణ్ణి, చూస్తూనే, ''ఆహాఁ, జాతరలో నాట్యం చేయాలిగదా! అందుకు యిప్పటి నుంచే అభ్యాసం చేస్తున్నావా ?'' అని అడిగింది.

ఆ ప్రశ్నకు పేదరాలు రెచ్చిపోయి, ''జాతరకాదు, నిన్ను పాతరవేయిస్తాను! భూతవైద్యుడు గండయ్యను పిలుచుకువచ్చి, నువ్వు చెట్టు దిగకుండా మేకు కొట్టిస్తాను. నా మొగుడు తాగి, నన్ను కొట్టి డబ్బు లాక్కుపోతున్నాడని చెప్పినందుకు, అతగాడికి కాళ్ళూ, చేతులూ పట్టుకుపోయేలా చేసి మంచం పట్టిస్తావా ?'' అన్నది పళ్ళుకొరుకుతూ.

మేకు కొట్టించడం అన్నమాటలు వినగానే, కుర్రపిశాచం గడగడ వణికిపోతూ, ''అంత ఘోరం చేయకు, తల్లీ! ఇంటికి వెళ్ళి చూడు. నీ భర్త ఎప్పటిలా కూనిరాగాలు తీస్తూంటాడు,'' అన్నది.

పేదరాలు, పిశాచాన్ని తిట్టుకుంటూ వెళ్ళిపోయింది. కుర్రపిశాచానికి, అక్కడ వుండడం క్షేమం కాదనిపించింది. ధనికుడూ, మధ్యతరగతివాడూ, పేదరాలూ తిరిగివచ్చి, వాళ్ళన్నంతపనీ చేయవచ్చు!

ఇలా ఆలోచించి, కుర్రపిశాచం అక్కడినుంచి ఎగిరి, అడవిలోని ఒక ఊడల మర్రి మీద వాలి, ''పాడుమనుషులు! వాళ్ళకు మేలు చేయబోవడం, నాదే తప్పు,'' అంటూ అరిచింది కోపంకొద్దీ.

ఆ చెట్టు మీద స్థిరనివాసం ఏర్పచుకున్న, ఒక ముసలిపిశాచం కుర్రపిశాచం నుంచి జరిగినదంతా విని, ''తప్పంతా నీది! మనుషులు పూజించేది, దైవశక్తిని గాని, పిశాచాల మాయల్ని కాదు. గుడులు దేవుళ్ళకోసం, మనబోటి పిశాచాలకొక్కడు. ఈ అనుభవంతోనయినా బుద్ధి తెచ్చుకుని, ఊళ్ళకేసిపోక, యీ చెట్టు మీద కాలం వెళ్ళబుచ్చు,'' అని హితవు చెప్పింది.





# కృష్ణావతారం

కృష్ణుడికి యౌవనం సంప్రాప్తమయింది. అతని అందమూ, బలమూ వ్రేపల్లెలోని స్త్రీలనందరినీ అలరింపజేశాయి. ఒకనాటి అర్ధరాత్రి, చుట్టూ వలయంగా గోపికలను నిలిపి, మధ్య తానుండి ఆటల వేడుకలో ఉండగా అరిష్టుడనే రాక్షసుడు ఒక బలమైన ఆబోతు రూపం ధరించి, పెద్దగా రంకెలు పెడుతూ కృష్ణుణ్ణి ధ్వంసం చెయ్యటానికి వచ్చాడు.

ఆ ఆబోతు ఆకారమూ, అది పెట్టే భయంకరమైన రంకెలూ చూసి గోపికలు భయపడి కళ్ళు మూసుకుని కృష్ణుడి చాటుకు వెళ్ళారు.

భయపడవద్దని కృష్ణుడు గోపికలకు ధైర్యం చెప్పి, మీదికి వస్తున్న ఆ ఆబోతు కొమ్ములు రెండూ గట్టిగా పట్టుకుని కదల లేకుండా చేసి, బలంగా దాని మెడ మెలిపెట్టి, ఒక్క తోపు తోశాడు.

నోటా, ముక్కులా రక్తం కక్కుతూ, విలవిల తన్నుకుంటూ ఆ ఆబోతు చచ్చి పడిపోయింది.

అప్పటికి గోపికలకు ధైర్యం వచ్చి, అతన్ని చుట్టుముట్టి, గొప్పగా ప్రశంసించారు.

ఇక్కడ కృష్ణుడిలా ఉంటే, మధురాపురంలో కంసుడు నిత్యమూ చస్తున్నాడు. అతని మనస్సంతా వికలమయింది. క్రమంగా జీవచ్ఛవంలాగా తయారయాడు. ఒకనాడతను తన సభాభవనానికి ఉగ్రసేనుణ్ణీ, వసుదేవుణ్ణీ, సత్యకుణ్ణీ,

9. కంసుడి ఆహ్వానం



అంధకుణ్ణీ, కంపకుణ్ణీ, దారుకుణ్ణీ, విపృథుణ్ణీ, బభ్రుణ్ణీ తదితర యదు, భోజ ప్రముఖులను పిలిపించి, వారితో ఇలా అన్నాడు:

"మీ రందరూ గొప్ప మేధావులు, జ్ఞానులు, ఎలాటి సమస్యలనైనా పరిష్కరించగలవారు; నాకు ఎంతో మేలు చేయాలనే దృష్టిగలవారు. అయినప్పటికీ, నా కిప్పుడొక పెద్ద ప్రమాదం వచ్చిపడినా, ఏ కారణంచేతనో మీరు చూస్తూ ఉండిపోయారు. నందగోపుడికి పుట్టిన కృష్ణుడనేవాడు నన్ను నిర్మూలించటానికి సిద్ధంగా ఉన్నాడు. వాడు అశ్రద్ధ చేసిన జాడ్యంలాగాను, గాలి తోడైన మేఘంలాగానూ, విషవృక్షంలాగానూ దినదినమూ వృద్ధి పొందుతున్నాడు. వా డెలాటి అంశతో పుట్టినదీ, ఎంత ఆలోచించినా అంతుపట్టకుండా ఉన్నది. ఏ దేవతాంశనో పుట్టాడేమో ననిపిస్తుంది. ఎందుకంటే వాడి చరిత్రంతా అమానుషంగానే ఉన్నది. చెబుతాను వినండి."

కంసుడు వారితో కృష్ణుడి పనులన్నీ వివరించి చెప్పాడు: సరిగా కళ్ళు తెరవని దశలోనే పూతనను చంపాడు; బోర్లా పడటం కూడా రాని రోజుల్లోనే బండిని ఒక్క తన్నుతో తుత్తునియలు చేశాడు; తప్పటడుగులు వేసే ఈడున జంట మద్దిచెట్లకు రోలు తగిలించి లాగి, కూల్చేశాడు; ఒకటేమిటి? ఆ రోజు కారోజు గడుస్తున్నకొద్దీ కాళియుణ్ణి మర్దించాడు, ప్రలంబుణ్ణీ, ధేనుకుణ్ణీ చంపించాడు. అరిష్టుణ్ణి చంపాడు. బాల్యం మాట దేవు డెరుగు, వయసు వచ్చినవాళ్ళు మాత్రం ఇలాటి పనులు చేయగలిగారా? ఏడు రోజులు ఎడాతెరిపి లేకుండా కుంభవర్షం కురిస్తే కొండను అవలీలగా గొడుగల్లే ఎత్తేసి పట్టుకున్నాడు. ఆ అమానుష కార్యం ఒక్కటే చాలు, మిగతావి చెప్పుకోనవసరం లేదు.

ఇదంతా చెప్పి కంసుడు వారితో మళ్ళీ ఇలా అన్నాడు:



''ఇక మిగిలి ఉన్న రాక్షసుడు కేశి ఒకడే. కేశి కూడా కృష్ణుడి చేత చచ్చా డంటే ఆ తరవాత వచ్చేది నా వంతే. చంప మరిగినవాడు నన్ను మాత్రం విడిచి పెడతాడా ? వట్టిది. కృష్ణుడే అనుకుంటే వాడంతవాడు వాడి అన్న బలరాము డొకడు కూడా ఉన్నాడు. అసలు జరిగిన దేమిటో నారదుడు నాకు చెప్పాడు. దేవకీ దేవి అర్ధరాత్రివేళ కొడుకును కంటే, ఈ వసుదేవుడు వాణ్ణి తీసుకుపోయి నంద గోపుడి భార్య పక్కలో పెట్టి, ఆమె కన్న ఆడపిల్లను తెచ్చి తన భార్య పక్కలో పెట్టాడు. అది కూడా నాకు అందకుండా ఆకాశానికెగిరి, వింధ్యవాసినీ దేవత అయి కూర్చున్నది. ఇంత కాలంగా అయిన వాడల్లే నటిస్తూ వసుదేవుడు నా కింత ద్రోహం చేశాడు. నేను ఎంత మర్యాద చేశానో, నాకు అంత గొప్ప ద్రోహం చేశాడు.''

తరవాత కంసుడు వసుదేవుడి కేసి తిరిగి, ''నీ ఆలోచన నాకు తెలుసు; నీ కొడుకు చేత నన్ను చంపించి, వాణ్ణి మధురకు రాజు చేసి ఏలింతా మను కుంటున్నావు. కాని నీ కొకటి తెలీదు; ఇంద్రుడే వచ్చినా నన్నేమీ చెయ్యలేడు. అక్కడే భ్రమపడ్డావు. నువ్వు చక్రవర్తి వంశంలో పుట్టావు, చిన్నతనం నుంచీ మా తండ్రి దగ్గిర పెరిగావు. మా చెల్లెల్ని పెళ్ళాడి, యాదవు లందరికీ గురుస్థాన మైనావు; ఇలాటి నీచమైన పని చేస్తావా ? నీ పాతకం నీకే ఉండనీ, నేను నిన్ను చంపను. ఇంతవరకు బంధు మిత్ర బ్రాహ్మణ హత్యలు చేసినవాణ్ణి కాను; ఇకమీదట చేయను కూడా. నిన్ను వెళ్ళ గొట్టవచ్చు; కాని అది కూడా చెయ్యను. నీ అంతట నువు పోతేపో, ఉంటే ఉండు,'' అన్నాడు.

తరవాత కంసుడు భోజవంశం వాడైన అక్రూరుడి కేసి తిరిగి, ''నేను ఈ యేడు నా ధనుస్సుకు గొప్ప ఉత్సవం చెయ్య బోతున్నాను. దానికి ఎక్కడెక్కడి




రాజులూ వస్తారు. చాలా రోజులపాటు విందు చెయ్యవలసి ఉంటుంది. గోకులం నుంచి పుష్కలంగా పెరుగూ, పాలూ, నెయ్యీ, అడవితేనే కావలసి వస్తుంది. అందుచేత నువు గోకులానికి వెళ్ళి ఇవన్నీ వచ్చేటట్టు ఆజ్ఞ ఇయ్యి. తిరిగి వచ్చేటప్పుడు నందగోపుణ్ణీ, అతని కుటుంబాన్నీ వెంటబెట్టుకురా. నా మేనల్లుళ్ళయిన బలరామకృష్ణులను చూడాలని నాకు మహా వేడుకగా ఉంది. వాళ్ళు మహా బలులట. నేను తమను చూడాలని ఉవ్విళ్ళూరుతున్నానని నమ్మకం కలిగేలాగా చెప్పి, వాళ్ళను వెంటబెట్టుకురా. నా దగ్గిర ఇద్దరు మేటి మల్లులున్నారు. వీళ్ళకూ వాళ్ళకూ పోటీపెట్టి వాళ్ళ బలపరాక్రమాలెలాటివో చూస్తాను. వాళ్ళిద్దరినీ తెచ్చావంటే నాకు మహోపకారం చేసిన వాడవవుతావు. వసుదేవుడేమన్నా చెవిలో ఊదుతాడేమో, అదేమీ వినిపించుకోక, నువు వెంటనే బయలుదేరు,'' అన్నాడు.

కంసుడి పరివారంలో కృష్ణుణ్ణి భగవంతుడి అవతారంగా భావించే వారు చాలామంది ఉన్నారు. వారిలో అక్రూరుడొకడు. కృష్ణుణ్ణి కళ్ళారా చూసి తరించే అవకాశం దొరికినందుకు లోపల పొంగిపోతూ, అక్రూరుడు కంసుడివద్ద సెలవు పుచ్చుకుని అప్పటికప్పుడే రథం ఎక్కి, వ్రేపల్లెకు బయలుదేరాడు.

మొత్తంమీద కంసుడు - వసుదేవుణ్ణి గురించి అంతమంది మధ్యా అలా మాట్లాడటం పెద్దలకందరికీ కర్ణకఠోరమనిపించింది. కాని, ఎవరూ నోరు విప్పలేదు. వారిలో వృద్ధుడైన అంధకుడనే యాదవుడు నిర్భయంగా ముందుకు వచ్చి, కంసుడితో ఇలా అన్నాడు:

''నువ్వన్న మాటలు రాజోచితమైనవి కావు. ముందూ వెనకా ఆలోచించకుండా పెద్దవాణ్ణి పట్టుకుని ఎంతెంత మాటలన్నావు! ఇలాటి ప్రవర్తనతో నీ తల్లిదండ్రులకూ, వంశానికీ తీరని కళంకం

తెచ్చావు. వసుదేవుడు తన కొడుకును దాచాడని తప్పుపట్టుతున్నావా? తల్లి దండ్రులు తమ సంతానాన్ని, కాపాడు కోవటానికి అడ్డమైన అగచాట్లూ పడరా? నీ తల్లిదండ్రులు నీకోసం ఏ పాట్లూ పడకుండానే నువ్వింతవాడివయావా? నీ ధోరణి మాకు ఏమీ బాగాలేదు. నీతో తెగ తెంపులు చేసుకుని వెళ్ళిపోలేకపోవటం మాదే బుద్ధి తక్కువ. మాకన్న ఆ అక్రూరుడు చాలా అదృష్టవంతుడు. కృష్ణుణ్ణి చూసి వచ్చిన అక్రూరుణ్ణి చూసి మేము కూడా పవిత్రుల మవుతాం. కృష్ణుడు యిక్కడికి వచ్చాడంటే నీకు చావు తప్పదు. నీ కెవరూ అడ్డుపడలేరు. అందు చేత నువే ముందు గోకులంలో వున్న కృష్ణుడి వద్దకు వెళ్ళి, అతన్ని మంచి చేసుకుని బాగుపడు.''

అంధకుడిలా అనేసరికి పట్టరాని కోపం వచ్చి, కంసుడు చివాలున లేచి వెళ్ళి పోయాడు. మిగిలినవారు కూడా తమ తమ ఇళ్ళకు వెళ్ళారు.

అక్రూరుడింకా గోకులం వెళ్ళక పూర్వమే కంసుడు కేశి అనే రాక్షసుణ్ణి బృందావనానికి పంపాడు. గుర్రం రూపు గల ఆ రాక్షసుడు బృందావనం చేరి, అక్కడి అరణ్యంలో మేతలు మేసే పశువులనూ, గోవులను కాసేవారినీ నాశనం చెయ్యసాగాడు. ఆ గుర్రాన్నీ, భయంకర మైన దాని అవతారాన్నీ చూస్తే గోకులాని కంతకూ దడ పుట్టుకొచ్చింది. ఆ గుర్రం





పశువుల కండలు చీల్చి తినేది. వాటి రక్తం తాగేది. అది అరణ్యంలో ఎక్కడా ఒక్క మృగం లేకుండా చేసి గోపకుల నివాసాల కేసి వచ్చింది. దాన్ని అంత దూరంలోనే చూసి గోకులంలో వాళ్ళు కృష్ణుణ్ణి శరణుజొచ్చారు. కృష్ణుడు వాళ్ళకు భయపడవద్దని చెప్పి, చప్పట్లు చరుస్తూ గట్టిగా కేక పెట్టి కేశిని కవ్వించాడు.

ఇలా కవ్వించటం చూసి గుర్రానికి చాలా పౌరుషం వచ్చింది. కృష్ణుడి చేతిలో ఎలాటి ఆయుధమూ లేకపోయేసరికి దాని పౌరుషం రెట్టింపయింది. అది పెద్దగా నోరు తెరిచి, దంతాలను భయంకరంగా బయట పెట్టి, పెద్దపెట్టున సకిలిస్తూ కృష్ణుడి పైకి వచ్చింది. అది వెనకకాళ్ళపై నిలబడి ముందు కాళ్ళెత్తి తన పైన దూకబోతే, కృష్ణుడు ఒడుపుగా పక్కకు తప్పుకుని, చప్పున తన చెయ్యి దాని నోట దూర్చి, దాని నాలుక మొదలంట పట్టుకున్నాడు.

వెంటనే గుర్రం ఆట కట్టింది. అది, కృష్ణుడి పట్టు తప్పించుకోలేక, అతన్ని కరవలేక, ఇంకేమీ చెయ్యలేక, కాళ్ళు నేలకేసి తాటిస్తూ, గుడ్లు వెళ్ళబెట్టి అతిహీనస్థితిలో పడింది. కృష్ణుడు దాని నాలుక పెరికి, కంఠం చీల్చి, పళ్ళు రాల్చి, దాని డొక్కలో చెయ్యి దూర్చి కెలికి, మహాదారుణంగా చంపేశాడు.

గోకులంలో వాళ్ళంతా పెద్దనిట్టూర్పులు విడిచారు. అందరూ చుట్టూరా చేరి అతన్ని ఎంతగానో అభినందించారు. గోపికలు పూలదండలు తెచ్చి కృష్ణుడి మెడనిండా వేశారు.

అప్పుడు నారదుడు అదృశ్యంగా ఆకాశంలో ఉండి, తన పేరు చెప్పుకుని కృష్ణుడితో, "నాయనా, కలహప్రియుణ్ణయిన నేను నీ యుద్ధం చూడటానికి ప్రత్యేకంగా దేవలోకం నుంచి వచ్చాను. నువు చూపిన ఈ పరాక్రమం ఇంద్రుడికి చెల్లేను, శివుడికి చెల్లేను, మరెవరికీ

సాధ్యం కాదు. ఆ ఇంద్రుడే అయినా ఎదుర్కొలేని ఈ కేశిని సునాయాసంగా చంపావు. వీణ్ణి చంపినందుకు నువు కేశవు డనే పేరుతో ప్రసిద్ధుడివవుతావు.'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఈ లోపల అక్రూరుడు మధురనుంచి, మేలైన గుర్రాలను పూన్చిన రథంలో బయలుదేరి, ఎక్కడా ఆగకుండా సాయం కాలం వేళకు వ్రేపల్లె చేరవచ్చాడు. సూర్యాస్తమయమై, చీకట్లు కమ్ముతూం డగా, వాటిని చెదరగొట్టుతూ చంద్రుడు ఉదయించాడు. గోకులం సందడిగా ఉన్నది. ఎక్కడ చూసినా వేలకొద్దీ గోవులు. గోపకులు వాటిని పేర్లు పెట్టి పిలుస్తున్నారు. పాలు పితికే ధ్వనులు వినబడుతున్నాయి. ఇలా కోలాహలంగా ఉన్న గోకులం మధ్యకు అక్రూరుడు రథాన్ని తోలు కొచ్చి, అంత దూరాన బలరామకృష్ణులను చూసి పరమానంద భరితుడయాడు. అతను చప్పున కృష్ణుణ్ణి సమీపించి తన గోత్రనామాలు చెప్పుకుని, కృష్ణుడి పాదాలకు భక్తితో నమస్కారం చేశాడు. కృష్ణుడతన్ని లేవనెత్తి కౌగిలించు కుని, కుశల ప్రశ్నలు వేసి, బలరాముడి వెంట అతన్ని తన ఇంటికి తీసుకు పోయాడు.

అక్రూరుడి కోరిక మీద నందగోపుడు మొదలైన గోపపెద్దలందరూ అతని వద్దకు వచ్చారు. వారితో అక్రూరు డిలా అన్నాడు:

''కంసమహారాజు తన ధనువుకు గొప్పగా ఉత్సవం చేయ తలపెట్టాడు. మీరందరూ మీరు మీరు చెల్లించ వలసిన కప్పాలు తీసుకువచ్చి చెల్లించండి. విందు లకుగాను పాలూ, వెన్న, నేతులూ, అడవి తేనె మొదలైనవి తీసుకురండి. ఈ ఉత్స వానికి తన మేనల్లుళ్ళయిన బలరామ కృష్ణులు కూడా రావాలని కంసమహారాజు మహావేడుక పడుతున్నాడు. మీరు వెంటనే ప్రయాణాలు కట్టండి. నేను ఇప్పుడే వీరిద్దరినీ రథం మీద తీసుకుని బయలు దేరుతాను.''





# తాబేటిచిప్ప

అయిదు వందల ఏళ్ళక్రితం సూచౌ నగరం పడమటి ద్వారం సమీపంలో వెన్ షీ అనేవాడు ఉండేవాడు. అతను అపారమైన తెలివితేటలు గలవాడు. చదరంగమూ, చిత్రకళా, నాట్యమూ, సంగీతమూ, జంత్రవాద్యాలూ—ఏదిబడితే అది నేర్చుకుని అన్నిటిలోనూ రాణించాడు. అయితే ఎవరో జ్యోతిష్కులు చిన్నతనంలో అతడి చక్రం వేసి, మహా ధనికుడవుతాడని చెప్పటంవల్ల, డబ్బు సంపాదించే ప్రయత్నం ఒక్కటీ చెయ్యక ఉన్నదంతా ఖర్చుపెడుతూ సరదాగా కాలక్షేపం చేశాడు.

త్వరలోనే అతని ఆస్తి అడుగంటే పరిస్థితి ఏర్పడింది. ఈలోపుగా అతని తోటి వాళ్ళంతా వర్తకం చేసి తమ ఆస్తులను రెండింతలూ, మూడింతలూ చేసుకున్నారు. ఇది చూసి వెన్ తాను కూడా వర్తకంలో వేలు పెట్టాలని యత్నించాడు, కాని అదేం గ్రహచారమో, అతను వ్యాపారం చేసినప్పుడల్లా నష్టం వచ్చింది.

ఒకనాడు నలభైమంది వర్తకులు ఒక ఓడ చేసుకుని సముద్రాల మీద బయలు దేరబోతున్నట్టు విని వెన్ తనను కూడా వారి వెంట తీసుకుపొమ్మన్నాడు. వెన్ సరదాగా కబుర్లు చెప్పి నవ్వించగలడనీ, అటువంటివాడు వెంట ఉంటే ప్రయాణం విసుగు పుట్టదనీ భావించి, వాళ్ళు సరే నన్నారు.

వెన్ ఉద్దేశం దేశాలు చూద్దామనే. అయితే వర్తకుల ప్రముఖుడు చాంగ్ అనే ఆయన అతనిచేత కూడా కొంత సరుకు కొనిపించి వర్తకం చేయింతామనే ఉద్దేశంతో మిగిలిన వర్తకులను చందాలు వెయ్యమన్నాడు. చందాలు వెయ్యటానికి చాలామంది ఒప్పలేదు. అందుచేత

చీనా జానపద కథ



సుమారు రెండు పలాల వెండి మాత్రమే పోగయింది. చాంగ్ దాన్ని వెన్ కిచ్చి, "ఇది సరుకులు కొనటానికి ఎలాగూ చాలదు. ఏవైనా పళ్ళూ, ఫలాలూ కొనుక్కో. దారి పొడుగునా తినవచ్చు," అన్నాడు. రేవులో కమలాఫలాలు అమ్ముతూంటే వెన్ తన వెండి యావత్తూ వెచ్చించి వచ్చినన్ని కమలాఫలాల బుట్టలు కొన్నాడు. వాటిని చూసి మిగిలిన వర్తకులు హేళనగా నవ్వారు.

ఓడ కొన్ని రోజులు ప్రయాణం చేసి ఒక దేశం చేరింది. అక్కడ ఒక రేవు పట్టణంలో ఓడకు లంగరు దించారు. వర్తకు లందరూ ఈ దేశం ఎరిగినవారే. సరుకులు ఈ దేశంలో తొమ్మిది పదింతలు ధరకు అమ్ముతాయి; అలాగే ఈ దేశపు సరుకులు చీనాలో హెచ్చు ధరలకు అమ్ముతాయి. అందుకే ప్రాణాలపైన కూడా ఆశ వదిలి చీనా వర్తకులు ఈ సముద్ర ప్రయాణాలు చేస్తారు. వర్తకులందరూ తమ సరుకులతో దిగి వెళ్ళాక వెన్‌కు తన కమలాఫలాలు జ్ఞాపకం వచ్చాయి. అందరూ వాటిని చూసి నవ్విన కారణంగా అతను ప్రయాణంలో వాటి ఊసు ఎత్తలేదు. అవి చెడిపోయాయేమోనని చూడటానికి అతను ఇప్పుడు బుట్టలను పైకి తీయించి, ఓడ పైభాగాన దొంతరలుగా అమర్చాడు. పళ్ళు బాగానే ఉన్నట్టు కనిపించాయి. అయినా రుచి చూద్దామని అతను ఒక కమలా వొలిచి కొన్ని తొనలు నోట్లో వేసుకున్నాడు.

అంతదాకా రేవులో ఉండేవాళ్ళు ఎర్రగా మెరిసే ఈ పళ్ళను వింతగా చూస్తున్నారు. వాటిని తింటారని వాళ్ళకిప్పుడర్థమయింది. వారిలో ఒకడు ఒక బరువైన వెండి రూపాయి తీసి వెన్ చేతిలో పెట్టి ఒకటి ఇయ్యమని వేలు చూపాడు. వాడు ఒక కమలా తీసుకుని, వెన్ చేసినట్టుగానే తోలు వొలిచి బద్దలు తినటానికి మారుగా పండంతా నోట్లో వేసుకుని నొక్కి రసం తాగి, పిప్పి, గింజలూ,



అంతా కలిపి మింగేశాడు. వాడికి దాని రుచి అద్భుతంగా కనిపించింది. వాడు వెన్‌కు మరి పదిరూపాయ లిచ్చి పది పళ్ళు పట్టుకుని వెళ్ళిపోయాడు.

ఆ తరవాత కమలాలను కొనటానికి జనం ఎగబడ్డారు. వెన్ కమలాలలో సగానికి పైగా అయిపోయినాక, పండుకు రెండేసి రూపాయలు వసూలు చేశాడు.

ఈ లోపల మిగిలిన వర్తకులు తిరిగి వచ్చి, వెన్ చేసిన వ్యాపారం గురించి విని, "చాలా అదృష్టవంతుడివి. ఇక్కడి సరుకులు కొనుక్కున్నావంటే చీనాలో లాభసాటిగా అమ్ముకోవచ్చు." అన్నారు. కాని వెన్ తనకు పట్టవలిసిన అదృష్టమేదో పట్టనే పట్టిందనుకుని తాను సంపాదించుకున్న వెండితో తృప్తిపడ్డాడు.

వర్తకులు తమ సరుకునంతా మారకం వేసుకోవటానికి పదిహేను రోజులు పట్టింది. ఆ తరవాత వారు ఓడలో ఎక్కి మళ్ళీ ప్రయాణం సాగించారు. కొద్ది రోజుల అనంతరం సముద్రంలో బలమైన తుఫానుగాలి సాగి, ఓడ కొట్టుకుపోసాగింది. చివరకు వర్తకులు ఒక నిర్జన ద్వీపప్రాంతానికి చేరుకుని గాలి తగ్గేదాకా ఓడను అక్కడ లంగరు వేశారు.

వెన్ లంకను చూసి వస్తానని బయలుదేరాడు. "నిర్జనమైన లంకలో చూడటానికేముంటుంది?" అని అందరూ నిరుత్సాహపరిచినా వినక అతను ఒంటరిగా బయలుదేరాడు. లంక మధ్యను అటే ఎత్తు లేని గుట్ట ఒకటి ఉన్నది. కొండ మీద పెరిగే లతల సహాయంతో పాకుతూ వెన్ ఆ గుట్ట పైభాగాన్ని చేరుకున్నాడు. అక్కడి నుంచి చూస్తే నలువైపులా అతనికి సముద్రం కనిపించింది. ఇంతలో అతని కన్ను సమీపంలో గడ్డి మధ్య పడి ఉన్న ఒక వింత వస్తువును చూసింది. దగ్గిరికి వెళ్ళి చూస్తే అదొక తాబేటి చిప్ప! అయితే అది చాలా పెద్దది—ఒక మంచం ప్రమాణంలో ఉన్నది. "ఇంతంత తాబేళ్ళు కూడా ఉంటాయా?" అని వెన్ ఆశ్చర్యపడ్డాడు.



అటువంటి తాబేటి చిప్ప ప్రపంచంలో ఎవరూ చూసి ఉండరు. తాను చూశానంటే ఎవరూ నమ్మరు; "సూచౌవాళ్ళు కోతలరాయుళ్ళు!" అంటారు. అదీగాక, దీన్ని తన దేశం పట్టుకుపోయి నిలువునా కోయించి, కోళ్ళు అమర్చితే రెండు మంచాలవుతాయి! వెన్ ఈ విధంగా అనుకుని ఆ తాబేటి చిప్పకు బట్ట కొంగు కట్టి రేవు దగ్గిరికి ఈడ్చుకొచ్చాడు. వర్తకులందరూ దాన్ని చూసి ఆశ్చర్యపడ్డారు; కొందరు దాన్ని చీనా తీసుకుపోవటం మోతచేటు అన్నారు; మరి కొందరు వైద్యానికి పనికి వస్తుందన్నారు. "మీరందరూ విదేశీసరుకులు తెచ్చుకుంటున్నారు కారా? ఇది నా విదేశీ సరుకు! డబ్బు దుగ్గాని ఖర్చు కాకుండా వచ్చింది, అంతే తేడా!" అన్నాడు వెన్.

మర్నాడు గాలి విసురు తగ్గింది. ఓడ తిరిగి ప్రయాణం సాగించింది. అది చీనా తీరాన్ని చేరగానే వర్తకుల దళార్లు వచ్చి ఫలాని ఫలాని వర్తకుల వద్దకు రమ్మని ఓడలో వచ్చిన వర్తకులను ఆహ్వానించారు. వెన్, అతని అనుచరులూ ఒక ఇరానీ వర్తకుణ్ణి చూడబోయారు. అతని పేరు అబూ హసన్. ఆయన తన అతిథులకోసం పెద్ద ఎత్తున విందు ఏర్పాటు చేశాడు.

ఇలాటి విందుల్లో అతిథులను కూచోబెట్టేటప్పుడు ఎక్కువ ఖరీదైన సరుకులు తెచ్చినవాణ్ణి ఉన్నతాసనం పైన కూచోబెట్టి అందరికంటె తక్కువ తెచ్చినవాణ్ణి పంక్తిలో చివర కూచోబెట్టే ఆచారం ఉన్నది. ఆసనాలు నిర్ణయించటానికిగాను ఇరానీ వర్తకుడు అందరి సరుకుల జాబితాలూ తణిఖీ చేశాడు. వెన్ దగ్గిర ఏ జాబితా కూడా లేదు. అందుచేత అతన్ని పంక్తి చివర కూచోబెట్టారు.

మర్నాడు ఇరానీ వర్తకుడు ఓడ వద్దకు సరుకులు చూడవచ్చాడు. ఆయన ఓడ ఎక్కుతూనే పైభాగాన పడి దొర్లే తాబేటి చిప్ప చూసి, నిర్ఘాంతపోయి, "ఈ వెల లేని సామాను ఎవరిది? దీనిని అమ్మరా?"

అని అడిగాడు. అది వెన్ సొత్తని మిగిలిన వాళ్ళు చెప్పారు.

ఇరానీ వర్తకుడి ముఖంలో బాధా, కోపమూ కనిపించాయి. "ఇన్నాళ్ళుగా మీరంతా నాతో వ్యాపారం చేస్తూ కూడా ఈ పెద్దమనిషి సంగతి దాచిపెట్టి అతనిని విందులో పంక్తి చివర కూచోపెట్ట నిచ్చారు. నేను వారికి ముందు క్షమాపణ చెప్పుకోవాలి! మీ సరుకుల సంగతి తరవాత చూస్తాను!" అంటూ అయన వెన్‌ను వెంట బెట్టుకుని తీరానికి వెళ్లాడు.

అబూ హసన్, వెన్‌ను తన దుకాణానికి తీసుకుపోయి కూచోబెట్టి, తిరిగి వచ్చి మిగిలినవారిని తీసుకుపోయాడు. తరవాత అతను అందరి ఎదటా వెన్‌ను, "ఆ తాబేటి చిప్ప అమ్ముతారా?" అన్నాడు.

వెన్ తెలివి లేనివాడుకాడు. "మంచి ధర వస్తే అమ్మటానికేం?" అన్నాడు.

"అయితే ఎంత ఇమ్మంటారో అడగండి! నేను గిల్లి బేరం ఆడేవాణ్ణి కాను!" అన్నాడు అబూ హసన్.

వెన్ చాంగ్‌తో సంప్రతించాడు. వారు రహస్యంగా మాట్లాడుకున్నారు.

చిట్టచివరకు చాంగ్ హసన్‌తో, వేళాకోళంగా అన్నట్టుగా, "అతని ఉద్దేశం పది వేలు అడగాలని ఉన్నట్టున్నది!" అన్నాడు.

"అంటే ఆయనకు అమ్మాలని లేదన్న మాట!" అన్నాడు హసన్.

ఆ తాబేటి చిప్ప చాలా విలువైనదని వర్తకులకు తెలిసిపోయింది. చాంగ్ ఇక దాపరికం లేకుండా హసన్‌కు, వెన్ కథ అంతా చెప్పి, ఎంత ఇవ్వాలో హసన్‌నే నిర్ణయించమన్నాడు. హసన్ యాభైవేల పలాల వెండి ఇచ్చి తాబేటి చిప్పను, కొన్నాడు. అది కూడా చాలా తక్కువ ధరే. ఆ తాబేటిచిప్పలో వెలలేని ముత్యాలు అంగుళం ప్రమాణం గలవి ఉంటాయట. ఏమైనా ఆనాటితో వెన్ దుర్దినాలు దాటిపోయాయి. అతను పెళ్ళాడి, పెద్ద వర్తకులలో ఒకడై సుఖంగా జీవించాడు.





# సౌదామిని కథ

[గత సంచిక తరువాయి]

సౌదామిని యింతవరకు కథ చెప్పి, తండ్రితో, "నాన్నా, కనకప్రభ కౌండిన్య దేశపు యువరాజును వివాహమాడాలా? రాజశేఖరుణ్ణి వివాహమాడాలా? లేక గంధర్వుణ్ణి వివాహమాడాలా? అన్న అంశం వివాదాలకు కారణం అవుతుందన్నది స్పష్టమే గదా. తల్లీ, కుమార్తే— తలొకరినీ వరునిగా ఎంచి, మనసానిర్ణయాలు చేసుకున్నారు. అయితే, కనకప్రభ, ఆ ముగ్గురిలో ఎవరిని వివాహమాడాలి? ఎవరు చేసినది, ధర్మబద్ధమైన వాగ్దానం అవుతుంది? ఆ ముగ్గురిలో ఎవరి అభిప్రాయాన్ని మన్నించాలి?—ఇదే నా కథలోని సమస్య!

"నన్ను వివాహమాడవచ్చిన వ్యక్తికి, యీ కథ చెప్పి, అతని సమాధానాన్ని నాకు చెప్పండి. అది సరైనది అవునా, కాదా అన్నది నేను మీకు చెబుతాను," అన్నది.

రాజు అనంగవర్మ, తన ఉత్సుకతను అపుకోలేక, "నువ్వు చెప్పిన కథలోని కనకప్రభ, గంధర్వుణ్ణి పెళ్ళి చేసుకుంటుంది గద, తల్లీ!" అన్నాడు.

సౌదామిని చిరునవ్వుతో తల అడ్డంగా వూపింది.

"మరెవరిని?" అని, అనంగవర్మ యింకేదో చెప్పబోయేంతలో, సౌదామిని ఆయన్ని వారిస్తూ, సమాధానం మీకు కాబోయే అల్లుడు చెబుతాడు. అయితే, నాన్నా, ముగ్గురు వరులలో, ఎవరిదో ఒక పేరు చెబితే చాలదు. వివరణతో సహా సమాధానం చెప్పాలి," అన్నది.

లక్ష్మీగాయత్రి

కొన్ని నెలలు గడిచాయి. సౌదామిని కథ విన్నవాళ్ళెవరూ, అమెకు తృప్తికర మైన సమాధానం చెప్పలేకపోయారు. అమె తండ్రి అనంగవర్మ కుమార్తె వివాహం గురించి బెంగపడసాగాడు.

ఇలా వుండగా—అనంగవర్మకు దూరపు బంధువైన జయంతదేశపు రాజు విచిత్రసేనుడు, తన కుమారుడైన చంద్రహాసుణ్ణి, ఒక లేఖతో అనంగవర్మ దగ్గిరకు పంపించాడు.

ఆ లేఖలో యిలా వున్నది: ప్రియమైన అనంగా! మూడు తరాలకిందట, నా రాజ్యం, పొరుగుదేశమైన బల్లాణదేశంతో యుద్ధం చేసి ఓడిపోయి, బల్లాణకు సామంతరాజ్యమైన విషయం, నీకు తెలిసిందే గదా! ప్రస్తుతపు బల్లాణరాజు వికర్ణుడు, తన పూర్వులకంటే కూడా కుత్సిత మనస్కుడు. నన్ను పూర్తిగా సింహాసనభ్రష్టుణ్ణి చేసి, నా రాజ్యాన్ని, తన రాజ్యంలో కలుపుకునేందుకు ప్రయత్నాలు చేస్తున్నాడు. నేను వృద్ధుణ్ణయిపోయాను. వీలైనంత త్వరలో చంద్రహాసుడికి పట్టం కట్టాలని, నా ఆలోచన. వాడు, వికర్ణుడి దురాలోచనలకూ, కుతంత్రాలకూ మండిపడుతున్నాడు. సైన్యాన్ని సమీకరించి, బల్లాణ మీదికి దండెత్తాలన్నది, వాడి ఆలోచన. అందుకుగాను గిరిజనులనూ, అడవి జాతులవాళ్ళనూ కూడా సైన్యంలో చేర్చి, మంచి శిక్షణ యిస్తున్నాడు. చంద్రహాసుడి





నాయకత్వాన, బల్లాణ దేశం మీదికి దండెత్తడం కోసం, నువ్వు సైనికసహాయం, ధనసహాయం చేయగలవేమోనని ఆశిస్తూ, వాణ్ణి నీ దగ్గిరకు పంపుతున్నాను.

లేఖ చదివి అనంగవర్మ చాలా సంతోషించి, చంద్రహాసుడితో, ''నాయనా, నీకు కావలసిన సైనిక, ధనసహాయాలు తప్పక చేస్తాను. ఇంత రాజ్యం, సంపదా వుండి కూడా, నేను తీరని సమస్యతో సతమతమవుతున్నాను,'' అన్నాడు.

''ఆ సమస్య ఏమిటో, నేను తెలుసుకో వచ్చునా?'' అన్నాడు చంద్రహాసుడు.

''తెలుసుకుని మాత్రం, ఏం చెయ్య గలవు?'' అని, అనంగవర్మ, సౌదామిని చెప్పిన కథను అతడికి చెప్పి, ''ఇంత వరకూ వచ్చినవాళ్ళలో, ఆ ముగ్గురు వరులలో ఎవరిదో ఒకరి పేరు చెప్పిన వాళ్ళేగాని, సౌదామిని మనసుకు నచ్చే వివరణ యిచ్చినవాళ్ళు లేరు,'' అన్నాడు విచారంగా.

''యువరాణికి నచ్చే జవాబు, నేను చెప్పగలననుకుంటాను,'' అన్నాడు చంద్రహాసుడు.

ఆ జవాబుకు, అనంగవర్మ ఎంతో సంతోషంగా, ''అంతకంటే నాకు కావలసినదేమున్నది, నాయనా! ఏమిటో చెప్పు?'' అని అడిగాడు.

చంద్రహాసుడు కొద్దిక్షణాలు మౌనంగా వూరుకుని, తర్వాత యిలా చెప్పాడు: ''కన్య, తండ్రికి సొంతసొత్తు ఎన్నటికీ కాదు. చక్రసేనుడు, విశ్వంభరుడితో పందెం వేసి, కనకప్రభను పణంగా ఒడ్డాడు. తనది కాని ఆస్తిని పందెంలో ఒడ్డడానికి, చక్రసేనుడికి న్యాయబద్ధమైన హక్కు ఏంతమాత్రం లేదు. అందువల్ల, కౌండిన్యదేశపు యువరాజును, కనకప్రభ పెళ్ళి చేసుకోవలసిన అగత్యం లేదు. చక్రసేనుడిది ధర్మబద్ధమైన వాగ్దానం కాదు.

ఇక, వరుణదత్తుడు; అతడు కనకప్రభ సౌందర్యాన్ని చూసి, క్షణికమైన వ్యామో

హంలో వివాహం చేసుకోవడానికి సిద్ధపడ్డాడు. పోతే, కనకప్రభ యువతీసహజమైన మనస్తత్వంతో, గంధర్వుడంతటి వాడు, తనను పొగడగానే, అతణ్ణి పెళ్ళాడడానికి సిద్ధపడింది. అంతేకాని, పూర్వాపరాలు ఆలోచించలేదు. అందువల్ల, యీ ఇద్దరిలోనూ, మనశ్శుద్ధి లోపించిన కారణంగా, వివాహం ధర్మసమ్మతం అనిపించుకోదు.

కనకప్రభకు తగిన భర్త, రాజశేఖరుడనే భావంతో, ఆమె తల్లి ఇందుమతీదేవి, మనసా అతణ్ణి తన అల్లుడుగా నిశ్చయించింది. కనకప్రభ యిష్టాన్ని కూడా తెలుసుకోవాలన్న వివేకంకొద్దీ, రాజశేఖరుడితో, 'ఇవ్వగలిగితే, వెలలేని సువర్ణాన్ని యిస్తాను!' అన్నది. కుమార్తె క్షేమం కోరి, సర్వవిధాలా ఉన్నతుడైన వ్యక్తిని ఎంచిన, ఈ సంబంధం ధర్మబద్ధమూ, సర్వోత్తమమూ అయినది. అందువల్ల, కనకప్రభ, రాజశేఖరుణ్ణి వివాహమాడడమే సమంజసం!'' అన్నాడు.

అనంగవర్మ సంతోషాశ్చర్యాలతో, చంద్రహాసుడి సమాధానాన్ని సౌదామినికి పంపించాడు.

కొద్దిసేపట్లో సౌదామిని చెలికత్తె, సౌదామిని పెంపుడు చిలుకనూ, ఒక పూలమాలనూ తీసుకువచ్చి, చంద్రహాసుడితో, ''యువరాణిగారు, చంద్రహాసుల వారికి శిరసానమస్కరించామని తెలియజేస్తూ, తనకు మారుగా ఈ చిలుకచేత, తమ మెడలో పూలమాలను వేయించమన్నారు!'' అన్నది.

చిలుక పూలమాలను, చంద్రహాసుడి మెడలో వేసింది. అనంగవర్మ పరమానంద భరితుడయ్యాడు. సౌదామినీ, చంద్రహాసుల వివాహం, అతివైభవంగా జరిగింది.

ఆ తర్వాత చంద్రహాసుడు, మామగారి సైన్యాన్ని కూడా వెంటబెట్టుకుపోయి, రాజు వికర్ణుణ్ణి ఓడించి, చందన, జయంత, బల్హాణరాజ్యాలు మూడింటికీ రాజై, చాలాకాలం సుఖంగా జీవించాడు.





# భార్యకుతగినభర్త

ఒక ఊళ్ళో సూరయ్యా, మంగమ్మా అని కాపు దంపతులుండేవాళ్ళు. సూరయ్య రోజూ పొద్దున్నే పొలానికి వెళ్ళి సాయంత్రానికి ఇంటికి వచ్చేవాడు. మంగమ్మ ఇంటిదగ్గిరే ఉండి ఇంటినీ, తన పెంపుడు కోళ్ళనూ చూసుకునేది. ఆమెకు కోళ్ళు పెంచడమంటే చాలా యిష్టం. అందువల్ల ఆ ఊరివాళ్ళంతా తమ కోడిపిల్లల్ని పెంపకానికి మంగమ్మ దగ్గిరికి తెచ్చి, అవి పెద్దవైన తర్వాత ఓ రెంటిని ఆమెకిచ్చి మిగతావి పట్టుకెళ్ళేవాళ్ళు. అలా మంగమ్మ దగ్గిర పాతిక ముప్ఫై కోళ్ళు పోగయాయి.

సూరయ్యకు కోడి మాంసమంటే బలే ఇష్టం. ఓ కోడిని కోసి వండమని అతను ఎన్నోసార్లు భార్యనడిగాడు. కాని ఆవిడ ససేమీ ఒప్పుకోలేదు. అతనికికోడి మాంసం తినాలనే కోరిక ఎక్కువ కాసాగింది.

ఆలోచించి ఆలోచించి సూరయ్య ఒక పన్నాగం పన్నాడు. అతను ఒకనాడు భార్యతో, "ఏమేవ్, మంగూ! నిన్న ఓ స్వాములవారు కనిపించాడు. మన పొలం ఈ మధ్య సరిగా పండటంలేదు కదూ? అందుకు కారణమేమిటని అడిగాను. అందుకాయన ఏం చెప్పాడంటే—మన ఊరిచివర రావిచెట్టున్నది చూశావా? ఆ చెట్టు తొర్రలో పంటల దేవుడున్నాట్ట. అందుకని రోజూ ఆ తొర్రలో కోడిమాంసం కూర ఉంచి వెనక్కు తిరిగిచూడకుండా వెళ్ళిపోవాలన్నాడు. అలా ఒక నెల రోజులపాటు చేస్తే పంటలదేవుడు అనుగ్రహించి మన పొలం బాగా పండుతుందిట," అని చెప్పాడు.

ఈ మాటలు విని మొదట మంగమ్మ గాభరా పడిపోయింది. తరవాత, ఎంతో సేపు ఆలోచించి, పొలం బాగా పండు

తుంది గదా అని తన మనస్సును సమాధాన పరుచుకుని, తన భర్త చెప్పినట్టు చెయ్యటానికి ఒప్పుకుంది.

ఆ నాటినుంచి మంగమ్మ రోజూ ఒక కోడిని కోసి, మసాలా వేసి కూరచేసి, అన్నంతోపాటు కట్టి తీసుకుపోయి, ఊరి చివర ఉన్న రావిచెట్టు తొర్రలో పెట్టి, వెనక్కు తిరిగి చూడకుండా ఇంటికి చక్కా వచ్చేది.

మంగమ్మ వెళ్ళిపోగానే సూరయ్య చెట్టు మీది నుంచి దిగి, తొర్రలో నుంచి మూట తీసి, సంతోషంగా కోడిమాంసం భోజనం ఆరగించేవాడు.

ఒక నెల గడిచింది. మంగమ్మ ఆఖరు కోడిని కూడా కోసేసింది. కాని భర్త చెప్పిన పంటల దేవుడి అనుగ్రహం మాత్రం ఏమీ కనిపించలేదు.

ఈ దేవుడిలో ఏదో మోసమున్నదని ఆమెకు అనుమానం తగిలింది.

అందుచేత మంగమ్మ ఆ రోజు భోజనం చెట్టు తొర్రలో ఉంచి మామూలు ప్రకారం వెనక్కు తిరిగి చూడకుండా వచ్చెయ్యటానికి మారుగా, కొంతదూరం వచ్చి ఒక చెట్టు వెనక దాగి ఏం జరుగుతుందోనని చూడసాగింది.

ఇంకేముందీ? సూరయ్య తిన్నగా రావిచెట్టు దిగి వచ్చి తొర్రలో నుంచి భోజనం తీసుకుని తినటం మంగమ్మ కంటపడింది. ఆమె అగ్గి మీద గుగ్గిలమై పోయి గబగబా వెళ్ళి మొగుడి వీపు



మీద చేతులు నొప్పి పుట్టేదాకా కొట్టి, తరవాత నోటికి వచ్చినట్టు తిట్టి, ''ఇక ఈ మొగుడితో సంసారం నావల్లకాదు,'' అంటూ ఇంటికి వచ్చేసింది.

ఆమె తన పుట్టింటికి వెళ్ళిపోవటానికి నిశ్చయించుకున్నది. మూటా ముల్లే ఒక పెద్ద గంపలో సర్దుకుని, ఇరుగు పొరుగు అమ్మలక్కలకు వీడ్కోలు చెప్పటానికి వెళ్ళింది. తన భార్య వెనకగా సూరయ్య కూడా ఇంటికి వచ్చాడు. తన భార్య ఎత్తుగడ అర్థం చేసుకున్నాడు. భార్య ప్రయాణానికి సిద్ధం చేసుకున్న గంపలో దూరి కూర్చున్నాడు.

మంగమ్మను అమ్మలక్కలు సాగనంప వచ్చారు. ఆమె తన ఇంటిని ఆఖరుసారి చూసుకుని బావురుమని ఒక శోకం పెట్టి, తన గంపను ఎత్తించుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది.

పుట్టిల్లు చేరుతూనే, మంగమ్మ వలవలా ఏడ్చి తల్లితో తన భర్త చేసిన మోసమంతా చెప్పింది.

తల్లి మంగమ్మను ఓదార్చుతూ, ''ఊరుకో తల్లీ! అయిందేదో అయింది. ఇక నువు ఆ మనిషి మొహం చూడవద్దు. ఇక్కడే ఉండిపో!'' అన్నది ఎంతో ఆప్యాయంగా.

ఆమె తన కూతురు గంపలో ఏం తెచ్చుకున్నదీ చూద్దామన్న కుతూహలం కొద్దీ దాని మూత పైకి ఎత్తేసరికి, సూరయ్య గభాల్న అందులో నుంచి బయటికి దూకి, ''నేనే, అత్తా! నీ అల్లుణ్ణి!'' అన్నాడు నవ్వుతూ.

ఇది చూసేసరికి అత్తకు మండిపోయింది. తన మీద పడి తినటానికని తన కూతురూ, అల్లుడూ పన్నాగం పన్ని వచ్చారనుకుని, ఆమె వాళ్ళిద్దరినీ బయటికి గెంటేసి, తన గదిలో అడుగు పెట్టటానికి వీల్లేదన్నది.

మంగమ్మ గత్యంతరం లేదని తెలుసుకుని, ఆ మొగుడితోనే కాపరం చెయ్య నిశ్చయించుకుని, అతడి వెంట ఇంటికి తిరిగి వచ్చేసింది.





## జలపాతం!

బ్రెజిల్-అర్జెంటీనా సరిహద్దులలో ఉన్న ఇగువాకూ జలపాతంలో వర్షాకాలంలో ఎనభై రోజులపాటు సెకండుకు 167,500 ఘనపుటడుగుల నీళ్లు కిందికి ప్రవహిస్తుంది. ఈ జలపాతానికి దిగువ ఉన్న నది ఇంతవరకు రెండుసార్లు జలపాతం ఎత్తుకు (250 అడుగులు) పొంగి ప్రవహించింది!

## నీటిలో కప్ప

దక్షిణాఫ్రికాకు చెందిన ఒకరకం గోళ్ళ కప్ప దాదాపు జీవితాంతం నీళ్ళ లోపలే ఉండి పోతుంది. ఈ కప్పల వెనుకకాళ్ళకు గోళ్ళుంటాయి. వీటిసాయంతో కప్పలు ఆహారాన్ని పట్టుకుంటాయి!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Takalkar



Azmat A. Syed

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బాల్యమంతా ఒక పాట! రెండవ ఫోటో : కాదు కాదు బొంగరాలాట!

పంపినవారు : డి. విజయశ్రీ, కనకదుర్గ ఆఫీసర్స్‌కాలనీ, విజయవాడ—8

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

# విజేతలకు చందమామ అభినందనలు

## మహోన్నత భారతీయ సంస్కృతి పోటీ

**3**



















జగిలింకి నీలవేణి
C/o శ్రీరాములు,
డోర్ నెం: 10-11-17,
పాతబస్టాండ్,
శ్రీకాకుళం-532 001

**I Prize**

సి. అనిల్‌కుమార్
"గాయత్రి", 23/71-4,
రాధాకృష్ణనగర్,
హైద్రాబాదు - 500 047

**II Prize**

మాష్టరు రవికిరణ్ పట్నాయక్
S/o పి. ఎస్. సన్యాసి రావ్,
ఖైరుబాలి పోస్ట్ - 765 018,
జిల్లా: కొరాపుట్ (ఒరిస్సా)

**III Prize**